శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే కూరనాథాయ నమః



శ్రీ శుద్ధసత్త్వం దొడ్డయాచార్యులవారు అనుగ్రహించిన

# కూరనాథ పంచాశత్

## - శ్రీపదపరిచర్యావ్యాఖ్యానము

పండితరత్న, వేదాన్తవాచస్పతి
ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులుగారు

ప్రకాశకులు
శ్రీకృష్ణఛారిటబుల్ ట్రస్ట్, నరసాపురం

2010

# కూరనాథ పంచాశత్ - శ్రీపదపరిచర్యావ్యాఖ్యానము

పండితరత్న, వేదాన్తవాచస్పతి
**ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులుగారు**

ప్రథమ ముద్రణ : ఏప్రిల్ 2010
ప్రతులు : 500
సందర్భం : భగవద్రామానుజుల అవతారోత్సవాలు
వేదిక : శ్రీఆదికేశవ ఎమ్బెరుమానార్ స్వామివార్ల కోవెల, నరసాపురం
వెల : రూ. 25/-

ముఖచిత్రం : కూరత్తాழ్వాన్ - శ్రీకూరం

ఈ గ్రంథం శ్రీమతి శ్రీప్రియ, శ్రీమాన్ రవిప్రకాష్ దంపతులచే
ఆచార్య కైంకర్యరూపంగా భక్తిశ్రద్ధలతో ముద్రింపబడినది.

ప్రతులకు : శ్రీమాన్ రవిప్రకాష్
కుమార్ రెసిడెన్సీ, పెంట్‌హౌస్
వాసవినగర్, రోడ్ నెం.10
మెట్రో వాటర్‌ట్యాంక్ ఎదురుగా,
దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్
ఫోన్ : 088013 76208

డి.టి.పి. : యస్.చంద్రశేఖర్, తిరుపతి.
ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి.



# నివేదన

**సా సూక్తిః జయతాత్తరాం సువిమలా శ్రీకూరనాథస్య యా**
**శ్రుత్యంతద్వయతత్త్వసార మధురా విద్వజ్జనానందినీ! ।**
**లక్ష్మీనాథసురూపవైభవగుణస్తోమస్వరూపాదికాన్**
**సుస్పష్టం విశదీకరోతి వివిధైః తర్కైః ప్రమాణానుగైః ॥**

**అకృత్తనఖకేశాయ నిత్యోపాదానవృత్తయే ।**
**శరజిత్‌సూరిభోగ్యాయ కూరనాథాయ మంగళమ్ ॥**

కూరేశులకు మంగళాశాసనం చేసే రెండవ శ్లోకంలో కూరేశులకు మూడు విశేషణాలు ప్రయోగింపబడ్డాయి. ఈ మూడు ఆ ఆచార్యశేఖరుల మహనీయ వ్యక్తిత్వాన్ని కీర్తిస్తున్నాయి. తమ కేశాలను, నఖాలను ఆశ్రయించి ఉండే ప్రాణులు తమను శరణాగతి చేసినవే  కాబట్టి, వాటి రక్షణ పరమధర్మం కనుక ఆ ధర్మాన్ని పాటిస్తూ, కేశఖండనను చేసికొననివారు కూరేశులు. దీనివల్ల వారి దయాది సద్గుణాలు వ్యక్తమవుతున్నాయి. అంతు లేని ఐశ్వర్యాన్ని కలవారైనా, కూరేశులు తమ సంపదను అంతటినీ సత్పాత్రదానాన్ని చేసి, ఉంఛవృత్తితో జీవనయాత్రను చేశారు. ఇందువల్ల వారి నిరీహ, లౌకికవిషయవైరాగ్యం వక్తమవుతున్నది. సదా నమ్మాழ్వార్ల శ్రీసూక్తులలో లగ్నమైన మనస్సు కలవారై, ఆ దివ్యప్రబంధంలోని మధురార్థాలను భావించి మనస్సు ద్రవించిన కూరేశులు "ఆழ్వాన్" అనే పేరుతో శ్రీరామానుజులవారి చేత సంభావింపబడ్డారనే ఐతిహ్యం ప్రసిద్ధం. ఇది వీరి భగవద్భాగవతభక్తికి ప్రతీక. అది మూడవ విశేషణంలో ప్రస్తుతం. ఒకవిధంగా చూస్తే చివరి రెండు విశేషణాలు **"పరమాత్మని యో రక్తో విరక్తో పరమాత్మని"** అనే ప్రమాణార్థాన్ని అనుసంధిస్తున్నాయని చెప్పవచ్చు. ఈ విధంగా అద్వితీయాలైన ఆత్మగుణాలను, సాటిలేని వైరాగ్యాన్ని, అంతు లేని భగవద్భాగవత భక్తిని కలవారు కూరేశులు. వీరి మహిమను పూర్ణంగా కీర్తించడం. **"ఎన్ శొల్లియాన్ వాழ్త్తువనే"** అని, **"కథం వర్ణ్యతే కూరనాథః"** అనే రీతిలో సాధ్యమైన పని కాదు. అయినా వారి మహిమ మనలను కీర్తించకుండా ఉండనీయదుకదా!

సంస్కృతస్తోత్ర వాఙ్మయంలో కూరేశులను స్తుతించే కృతులు ప్రధానంగా రెండు కన్పిస్తున్నాయి. వేదవ్యాస భట్టర్ వంశానికి చెందిన నడువిల్ తిరువీథి ప్పిళ్ళైభట్టర్ (సర్వజ్ఞభట్టర్) కృతమైన ఇరవై శ్లోకాలతో కూడుకొన్న **'కూరేశవింశతి'**

ఒకటికాగా, శుద్ధసత్త్వం దొడ్డయాచార్య స్వామివారిచే ప్రణీతమైన యాభై శ్లోకాలను కల '**కూరనాథపంచాశత్**' అనే ప్రకృతస్తోత్రం ఇంకొకటి.

పలురీతుల్లో ఈ కూరనాథపంచాశత్ విలక్షణమైనది. ఇందులో కూరేశులకు సంబంధించిన పలు ఐతిహ్యాలు, వారి పాండిత్యం, దయాదికల్యాణగుణాలు కీర్తింపబడ్డాయి. కూరేశులు కాశ్మీర దేశానికి శ్రీరామానుజులతోపాటు వెళ్ళి, బోధాయనవృత్తిని పూర్ణంగా బుద్ధిస్థం చేసికొన్న వృత్తాంతం 2వ శ్లోకంలో, చోళరాజు సభకు వెళ్ళి విష్ణు పారమ్యాన్ని స్థాపించిన వృత్తాంతం 3వ, 19వ, 20వ శ్లోకాలలో, ఆ*ళ్వా*న్ అనే నామంతో శ్రీరామానుజులు కూరేశులను సంబోధించిన వృత్తాంతం 40వ శ్లోకంలో, తిరువరఙ్గత్తముదనార్ కూరేశులను ఆశ్రయించిన ఐతిహ్యం 45వ శ్లోకంలో, బౌద్ధ మతంలోకి చేరిన వైదికుడైన బ్రాహ్మణ యువకుడు కూరేశుల కటాక్ష ప్రసరణతో మళ్ళీ వైదికుడుగా మాఱిన వృత్తాంతం 29వ శ్లోకంలో- ఈవిధంగా కూరేశులకు సంబంధించిన పలు వృత్తాంతాలు ఈ స్తుతిలో ప్రస్తావింపబడ్డాయి. ఇక కూరేశుల పాండిత్యం ఇరవై ఎనిమిదవ శ్లోకం నుండి 45వ శ్లోకం వరకు వరుసగా 18 శ్లోకాలతో స్తుతింపబడింది. ఈ సందర్భంలోనే పలుచోట్ల "**అనంతగుణ శేవధిః**" (43), "**దయాది సుగుణాదదపి**" (38) ఇత్యాదిగా కూరేశుల కల్యాణ గుణకీర్తనం చేయబడింది.

కావ్యప్రక్రియలో పలు శ్లోకాలు కూరేశులను సూర్యునిగా, చంద్రునిగా, తుమ్మెదగా, అమృతాబ్ధిగా, మహీధరంగా రూపిస్తున్నవి. కూరేశుల విభవమూర్తి వైభవాన్ని ప్రధానంగా కీర్తించే ఈ స్తుతిలో కూరేశుల అర్చామూర్తివర్ణనకూడా చివరలో కన్పించడం విశేషం. 46వ శ్లోకంనుండి అయిదు శ్లోకాలలో ఈ అర్చామూర్తి వర్ణన కన్పిస్తుంది. శ్రీదేశికులు యతిరాజసప్తతిలో ప్రధానంగా శ్రీరామానుజుల అవతారమూర్తిని వర్ణిస్తూ- "**ఉన్నిద్రపద్మసుభగా ముపదేశముద్రామ్**" అని అంటూ తిరుమలలో అంజలి ముద్రతో వేంచేసి ఉంటే అర్చారూపాన్ని గూర్చి ప్రస్తావించడం ప్రకృతంలో భావ్యం. ఇక, అలంకారిక విశేషాలను గమనిస్తే ఉపమ, రూపక, శ్లేష, ఉత్ప్రేక్షాది పలు అలంకారాలు ప్రయోగింపబడడాన్ని గమనించవచ్చు. 46, 47 శ్లోకాలలోని ఉదాత్తాలంకార సౌందర్యం ప్రత్యేకించి గమనించదగినది. మాలినీ, పంచచామర, శిఖరిణీ వృత్తాలు విరివిగా వాడబడ్డాయి. గహనాలైన వేదాంత విషయాలుకూడా పలు శ్లోకాలలో (17, 18, 32) ప్రస్తావింపబడ్డాయి. తిరువరఙ్గత్త ముదనార్ అనుగ్రహించిన ఇరామానుశనూ*ౕ*ఱ్*ఱ*న్దాది ప్రబంధంలోని కొన్ని పాశురా లకు, ఈ స్తుతిలో కొన్ని శ్లోకాలకు మధ్య ఉండే భావసామ్యం కూడా గమనార్హం (ఉదా-25, 26 శ్లో.)



ఈవిధంగా పలురీతులలో వైలక్షణ్యాన్ని కలిగిన ఈ స్తుతి ఇప్పుడు "**శ్రీపదపరి చర్యా**" అనే తెలుగు వ్యాఖ్యతోపాటుగా ప్రపన్నలోకానికి సమర్పింపబడు తున్నది. కూరేశుల సహస్రాబ్ది ఉత్సవాలు జరిగే ఈ ఏడు ఈ కూరేశుల స్తుతి ప్రచురింపబడడం సందర్భోచితంకదా! ఈ ఏడు నరసాపురంలో జరిగే ఎమ్బెరు మానార్ స్వామివారి అవతారోత్సవాలలోని కూరేశ విజయోత్సవ సందర్భంగా ఈ ప్రచురణ చేయబడు తున్నది. ఈ గ్రంథముద్రణకు అవసరమైన ద్రవ్యాన్ని భక్తిశ్రద్ధలతో సమర్పించిన **శ్రీమతి శ్రీప్రియ, శ్రీమాన్ రవి** దంపతులకు **(శ్రీకృష్ణ ఛారిటబుల్ ట్రస్ట్)** అనేక మంగళాశాసనాలు. వీరిరువురిని ఈ సత్కార్యానికి ప్రోత్సహించిన **శ్రీమతి, శ్రీమాన్ కృష్ణారావు** దంపతులను, **శ్రీమాన్ చి॥ బాలాజీని** అభినందిస్తున్నాను. శ్రీకృష్ణ ఛారిటబుల్ ట్రస్టు ఇదివరకే పూర్వదినచర్య, ఉత్తరదినచర్య వ్యాఖ్యానాన్ని, నిగమనప్పడి అనువాదాన్ని, శ్రీరామానుజ స్తుతిమణిమాల అనే గ్రంథాన్ని ముద్రించి, సంప్రదాయ ప్రచారంలో తనవంతు బాధ్యతను నిర్వర్తించింది. ఈ గ్రంథ ప్రచురణను **శ్రీమతి ల.స. సీతమ్మ గారు, న్యాయవేదాన్త విద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి** సన్నిధిలో వారి కైంకర్య రూపంగా శ్రీమతి శ్రీప్రియ, శ్రీమాన్ రవిప్రకాష్ దంపతులు చేసుకోవడం వారిరువురి భగవద్భాగవతాచార్య భక్తికి నిదర్శనం. ఈ స్తోత్రం ఇంతకుముందే పరమహంసపరివ్రాజకాచార్యులు, ఉపనిషత్ సిద్ధాంతపీఠ వ్యవస్థాపకులు, **శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయర్ స్వామివారి** అనుగ్రహంతో శరణ్య మాసపత్రికలో అనుస్యూతంగా ముద్రింపబడింది. ఇప్పుడు పుస్తకరూపంలో దీనిని వెలువరించడానికి తమ సమ్మతిని ప్రసాదించిన శ్రీ జీయర్ స్వామివారి సన్నిధిలో కృతజ్ఞతాపూర్వకంగా ప్రణమిల్లుతున్నాను. సకాలంలో గ్రంథాన్ని ముద్రణకు సిద్ధంచేసిన మిత్రులు శ్రీచంద్రశేఖర్ గారికి, చక్కగా ముద్రించిన శ్రీహర్షవర్ధన్ గారికి కృతజ్ఞతలు. స్వస్తి.

**పంచాశత్ కూరనాథస్య దొడ్డయార్యవినిర్మితా ।**
**వ్యాకృతా శింగరార్యేణ కూరేశపదసేవినా ॥**

**శ్రీకూరనాథగురువర దశశతహాయనసమాప్తిసందర్భే ।**
**వ్యాఖ్యా సమర్ప్యతేయం తత్పదపంకజసుమద్వయీసవిధే ॥**

ఇట్లు

తిరుపతి — భాగవత విధేయుడు

01-4-2010 — **ఈ.ఏ. శింగరాచార్యులు**

శ్రీ శుద్ధసత్త్వం దొడ్డయాచార్యులవారు అనుగ్రహించిన

# కూరనాథ పంచాశత్

## తనియన్

శ్రీశైలలక్ష్మణమునే శ్చరణాబ్జభృంగం
శ్రేయస్కరం తనుభృతా మఖిలాఘహంతృ ।
నత్వా కరోమి విబుధావలితుష్టయేఽహం
కూరాధిపస్తుతి మిమాం కుశలప్రదాత్రీమ్ ॥



1. జయ! జయ! యతిరాజశ్రీపదాంభోజయుగ్మ-
ప్రసృమరమకరందాస్వాదలుబ్ధాంతరంగ ।
జయ! జయ! కుమతేభవ్రాతహర్యక్ష! విద్వ
న్మణివర! నిగమాంతాకల్ప! కూరాధినాథ ॥

2. జయతి జగతి నైజోద్వేలమేధావిశేషాత్
అధిగతతమబోధావాసవృత్త్యర్థజాలః ।
జనితయతివరేణ్యస్వాంతనిస్సీమమోదః
శ్రితజనపరిరక్షాదీక్షితః కూరనాథః ॥

3. జయతి హరిపరత్వస్థాపనోద్వేలమోదాత్
ఉపనిషదుపగూఢాన్ న్యాయతోఽర్థాన్ వివృణ్వన్ ।
అధరితశివపారమ్యార్థిచోలాధిరాజః
శమితవిమతవాదః శాంతిమాన్ కూరనాథః ॥

4. భవజలధినిమగ్నోద్ధారణే బద్ధదీక్షః
కిము భువ మవతీర్ణః శ్రీపతిః కిన్ను సైన్యేట్ ।
ఉత శరరిపు రిత్యుల్లిఖ్యమానో మహద్భిః
జయతి గుణవరేణ్యః కూరనాథో మహాత్మా ॥



5. నిరవధికదయాబ్ధి ర్నాయ మావిర్భవేచ్చేత్
ఇహ భువి విమలాత్మా కూరనాథో మహీయాన్ ।
వివిధవిషయనక్రగ్రామజుష్టం కథం వా
భవజలనిధిపూరం నిస్తరేయుః జనౌఘాః ॥

6. సుచరితపరిపాకోఽస్మాదృశాం కిన్ను పద్మా-
కమితు రఖిలనేతుః ప్రేమసారః కృతాత్మా ।
విలసతి భువి కూరేశాత్మనోదీర్యమాణః
జయతి విబుధవర్యైః కూరనాథః కృపాలుః ॥

7. అపహృతభవతాపః (పైః) పావనైః ప్రేమసాంద్రైః
అమృతరసనిదానైః ఆత్మభాజాం కటాక్షైః ।
అనుకల ముపకుర్వన్ శేముషీశేషతాయాః
జలధిదుహితృజానేః భ్రాజతే కూరనాథః ॥

8. కృతకువలయమోదః కోశభూతః కలానాం
ద్విజపతి రఖిలాశాః శోభయన్ నైజధామ్నా ।
ప్రశమితపరితాపః ప్రాప్య విష్ణోః పదం తత్
విలసతి విబుధేడ్యః కూరనాథౌషధీశః ॥

9 సుజనహృదయపద్మోల్లాస మారాద్వితన్వన్
కుజనకువలయానాం మీలనం చాపి కుర్వన్
ఉదయ మధిగతోఽసౌ కూరనాథాంశుమాలీ
దురితతిమిరజాలం దేహభాజాం హినస్తి॥

10 అమృతజననభూమిః సంశ్రితానందదాయీ
సకలసుగణరత్నావాసభూః పూర్ణసత్త్వః ।
విమతకథకవర్యైః నావికై రప్యలంఘ్యః
స్ఫురతి భువి గభీరః కూరనాథామృతాబ్ధిః ॥

11. సదాఽభివృద్ధి మాశ్రితోఽక్షయోఽజడాశయోదయోఽ
కలంకభావభాసురో నిరాకృతోగ్రసంగమః ।
విరాజమానవిగ్రహో దివాఽపి మిత్రసన్నిధౌ
వినాకృతాస్తసంశ్రయో విభాతి కూరరాడ్విధుః ॥

12. ప్రసాద మేయివాన్ సదా ప్రకామవీక్ష్యవిగ్రహః
ప్రమోద మావహన్ నృణాం ప్రణాశయం స్తమస్తతిమ్ ।
సదోత్తరాయణాన్వితో విముక్తతామసగ్రహః
త్రయీమయోఽత్ర కూరరాట్ దివాకరో విరాజతే ॥

13. స్వకీయహృద్గుహాశయాళుసారసాక్షకేసరీ
పరీతవాగ్ఝరీభరో విరక్తముఖ్యసంశ్రయః ।
విశేషశాస్త్రయుక్తిభిః విచిత్రధాతుభిర్యుతః
విభాతి కూరరాణ్మహీధరః పుమర్థసిద్ధయే ॥

14. యతీశవాక్సుధాఝరీ సదానుభూతిమత్తధీః
త్రయీశిరోఽర్థగుంభితాః సుయుక్తిసాయకావలీః ।
సృజన్ కువాదివిద్విషః ప్రకాలయన్ గురోః పదేఽ
భిషిక్త ఏష కూరరాట్ ప్రశాస్తి వైష్ణవీం శ్రియమ్ ॥

15. కథాహవోన్ముఖాన్ బహూన్ కపర్దిదుర్మతాశ్రయాన్
ముధాకృతాగమశ్రమాన్ విధాయ వాదినః పరాన్ ।
బుధాధరీకృతిక్షమైః స్వవాగ్ఝరీభరై రసౌ
బుధావలీసమీడితః చకాస్తి కూరభూపతిః ॥

16 విభూతి మైహికీం త్యజన్ విమోహదాయినీం భృశం
విధాతృముఖ్యసేవితా మహంతయాఽతిదూషితామ్ ।
శ్రుతీడితా మనిందితాం స్వరూపశేముషీమతాం
శ్రియం సమాశ్రయన్నసౌ విభాతి కూరభూపతిః ॥

17. మృషామతం విధాయ తన్మృషా స్వయుక్తిభి ర్జగ
న్మృషాత్వబాధకప్రమాప్రకాశికాభి రాత్మనామ్ ।
అనేకతా మశేషతాం ప్రకాశయన్ వ్యపోహయన్
ప్రమాతృశేఖరస్తుతః ప్రకాశతేఽత్ర కూరరాట్ ॥

18. శ్రుతిం దృఢప్రమాణయన్ జగద్విధాతరీశ్వరే
పరోక్త మానుమానికేశ్వరత్వ మప్యథోనయన్ ।
అణో ర్జగన్నిదానతా మపోహయన్ విరాజతే
స్వసూక్తిభిః స్వయుక్తిభిః సుధీవరోఽత్ర కూరరాట్ ॥



19. శివాత్ పరం న హీతి వై లిఖేతి చోళభూపతేః
వచః శ్రుతే రనంతరం తదుత్తరం వచో లిఖన్।
అపాహస న్మహీసురై ర్య ఈడితో మహీపతిం
విభాతి కూరరాడ్గురు స్స సర్వశాస్త్రపారగః ॥

20. యతీశ్వరగ్రహాగతాన్ భటాన్ విలోక్యభూపతేః
స్వయం త్రిదండితాం భజన్ తదీయరక్షణేచ్ఛయా ।
శిలీముఖాల్పకీటయోః నయం సదార్యశిష్యయోః
ప్రదర్శయన్ స్వచర్యయా చకాస్తి కూరభూపతిః ॥

21. నిరాకర్తుం మోహం నిఖిలజనచిత్తాశ్రయ మసౌ
దయాసింధుః సాంద్రాత్ నిరవధికవిజ్ఞానవిభవాత్ ।
మహీభాగే మాసే మకరమహితాఖ్యే సమజని
ప్రశస్తే హస్తర్క్షే శుభగుణనిధిః కూరనృపతిః ॥

22. అనాధృష్యాం బ్రహ్మాదిభి రపి సురై రాత్మకృతిభిః
సదాఽప్యేకాకారామ్ అనధిగతవృద్ధిక్షయకథామ్ ।
అహంతా మజ్ఞానాం ప్రకృతి మనురూపాం మమ కృతేః
పురా కుర్వన్ కూరప్రభు రఖిలన్నాణాం విజయతే ॥

23. అమోఘై రుత్కూలై రనుపధి సముత్థై రనుపమైః
కటాక్షైః ప్రేమార్ద్రైః కలిమల మశేషం వ్యపనయన్ ।
జనానా మానందం నిరవధిక మద్యాపి జనయన్
జయత్యేష శ్రీమాన్ మమ కులగురుః కూరనృపతిః ॥

24. అవిద్యామాహాత్మ్యా దవిదితనిజాకారవిభవాన్
అశేషా నుద్ధర్తుం భవజలధిమగ్నాన్ జనిభృతః ।
అసౌ కూరాధీశః స్వయ మవతరన్ భూరికృపయా
నయన్ నావం విష్ణుం విగతతరపణ్యాం విజయతే ॥

25. పలాయధ్వం వేగాత్ క్వచన కథకాః కాననతలే
నిలీనా భూయాస్త ప్రతికథకమత్తేభమృగరాట్ ।
జయీ నానాతంత్రప్రవచనచణైః ప్రౌఢవచనైః
సమేతః శిష్యైస్సై రటతి వసుధాం కూరనృపతిః ॥

26. శ్రుతిశ్రేణీచూడాయసముసల మాదాయ శరజిత్-
వచఃశ్రేణీనిత్యానుభవనిరతో జృంభితమదః ।
ప్రధావన్నభ్యేతి ప్రతికథకవాదాహవరుచిం
నిరుంధన్ కూరేశద్విరదనృపతిః బృంహితరవైః ॥

27. అసారం సంసారం బహుళతరదుఃఖాకర మిమమ్
విసృజ్య శ్రీమంతం భజత విభు మానందభరితమ్ ।
ఉదార స్సర్వేభ్యో వితరతి జనాః స్వేన సమతామ్
అసా విత్యత్రత్యానుపదిశతి కూరాధిపగురుః ॥

28. విరక్తానా మగ్ర్యో విమలచరితో వైదికవరో
వినేత్యా చారాణాం విగతమదమోహాదిమగుణః ।
అసూయానిర్ముక్తః శమదమముఖానంతసుగుణః
సదా శ్రోత్రానందం కలయతి పరం కూరనృపతిః ॥

29. యదీయేక్షాపాత్రం భజతి మనుజః ప్రేమపదతాం
పరం పద్మాభర్తుః పతితజనచూడామణి రపి ।
యదీయా శ్రీసూక్తిః నిఖిలనిగమాంతార్థవివృతిః
స జీయాత్ కూరేశః సకలశుభసంతానసరణిః ॥

30. విశుద్ధజ్ఞానాబ్ధిః విగతమమకారః స్వపరయోః
వినేతా సర్వేషా మతివిమలబోధస్య విదుషామ్ ।
విహర్తా శ్రీరంగిప్రియతమయతీశానపదయోః
ప్రహర్తాఽసౌమ్యానాం భవతి భవినాం కూరనృపతిః ॥

31. పురాణానాం పుంసాం సరణి మనుయన్ తత్త్వవివృతౌ
ప్రకృత్యాత్మేశానాం పరమత మపాస్యన్ననృతతామ్ ।
పరాకుర్వన్ తత్త్వప్రమితపదయోః జీవతమసోః
సమింధే కూరేశః శ్రుతిశిఖరసంతానశరణమ్ ॥

32. స్వరూపాభివ్యక్తిం శ్రుతిశిఖరసిద్ధా మభిదధత్
నిరూప్యాం వృత్త్యైవాఖిలతనుభృతాం తాం చ కథయన్ ।
తదీయార్చాసీమాం స్వయ మపి వితన్వన్ యతిపతేః
అశేషం కైంకర్యం జయతి సుమతిః కూరనృపతిః ॥



33. నిరాలంబం కౌతస్కుతమత మసారం నిజవచః -
ప్రపంచైః వేదాంతప్రచురఫణితార్థా ననుగతైః ।
పరాకుర్వన్ ప్రౌఢప్రమితిజనకైః లక్ష్మణమునేః
పరిష్కుర్వన్ భాష్యం ప్రథయతి మతం కూరనృపతిః ॥

34. ప్రవాళరుచిరాధరస్ఫురితఛారుమందస్మితః
ప్రకామమధురాక్షరై రభినవైః స్వవాగ్గుంఫనైః ।
సదా వ్యవహరన్ కలాః సమితి సాత్త్వికాగ్రేసరాన్
తనోతి బహువిస్మయాతిశయచిత్రితాన్ కూరపః ॥

35. కథాహవకృతోద్యమాన్ కలిమలానులిప్తాశయాన్
తథాగతమతానుగాన్ తదితరాన్ ద్విషద్వాదినః ।
ముధాకృతపరిశ్రమాన్ ముకుళితాత్మవాగ్జృంభణాన్
విధాయ విబుధస్తుతో జయతి కూరనాథో గురుః ॥

36. నిరాకృతదురీహితైః నిగమసారసందర్శిభిః
నిరస్తదురితాలిభిః నిఖిలసంశయచ్ఛేదిభిః ।
నితాంతమధురైః శుభైః నిఖిలసౌఖ్యసంపాదకైః
నిజై ర్వచనగుంఫనైః జయతి కూరనాథో గురుః ॥

37. కలి ర్గతభవోఽభవత్ కలుషజాత మున్మూలితం
తమ శ్చ రజసా సమం విలయ మాప సత్త్వం పునః ।
సమేత్యుపచితం నృణా ముదయ మేతి ధీవల్లరీ
మహీతల ముపాగతే మహతి కూరనాథే గురౌ ॥

38. దయాదిసుగుణావలిః దనుజవైరిణా స్వామినా
నియంత్రితనిజాకృతిః నిలయ మేత్య కూరాధిపమ్ ।
ప్రతిక్షణవిజృంభితాకృతి రవాప్య లక్ష్యం పరం
ప్రకాశ మధిగచ్ఛతి ప్రతిహతాత్మతుల్యాధికః ॥

39. శ్రియఃపతి రుదారధీః శ్రుతిగణైకకంఠ్యేడితాం
విహాయ పరమేశతాం భువి యదాత్మనాఽచార్యతామ్ ।
అవాప్తు మవతీర్య తత్సముపలబ్ధయే శిష్యతాం
అవాప యతిభూపతేః విజయతాం స కూరాధిపః ॥

40. వచోభి రన్యతేతరైః అఖిలజీవజీవాతుభిః
ముముక్షుజనతాముదే మురరిపో ర్మహావైభవమ్ ।
సబాష్పనయనం బ్రువన్ సపులకోద్గమం సాదరం
సమిద్ధమధురస్మితో జయతి కూరపృథ్వీపతిః ॥

41. భవాఖ్యమరుమేదినీవలనజాతతాపాతురాన్
జనాన్ హరికథామృతైః మధురశీతలైః జీవయన్ ।
తదీయపదశేషతాధియ మపార ముత్పాదయన్
విభాతి భువి కూరరాట్ విబుధసంఘసంసేవితః ॥

42. అసద్భి రనుపద్రుతామ్ అనిదమాదివాణీం సతీం
అనన్యపదసంశ్రితాం హరిపదానుషక్తాం పరమ్ ।
జనార్దనపరత్వధీజనితభావబద్ధాశయైః
వచోభి రుపలాలయన్ జయతి కూరనాథో గురుః ॥

43. అనంతగుణమౌక్తికైః అఖిలచేతనామోదకైః
అనంతనయసాగరాత్ స్వయ ముపాహృతైః శోభనైః ।
అనంతపదసంశ్రితా నభివిభూషయన్ శోభతే
హ్యనంతగుణశేవధి ర్జయతి కూరనాథో గురుః ॥

44. ఆవాఙ్మనసగోచరామలదయాగుణైకాస్పదం
కులాదిమదదూషితోత్తరణబద్ధదీక్షః స్వయమ్ ।
యతీశ్వర మఘాపహం నిఖిలదేహినాం దర్శయన్
విలక్షణజనాశ్రితో జయతి కూరనాథో గురుః ॥

45. యతీశితు మధీశతా మసహతోఽపి రంగామృతాత్
స్వకై శ్శమముఖై ర్గుణైః స్వపదశిష్యతా మేయుషః ।
గురో స్సముపలబ్ధయా నిఖిలయాఽపి రంగశ్రియా
యతీశ మభినందయన్ జయతి కూరనాథో గురుః ॥

46. అనర్ఘవిపులాంశుకః సులసదూర్ధ్వపుండ్రాంకితః
సరోజతులసీమణిప్రచురమాలికాలంకృతః ।
కిరీటకటకాదిభిః వివిధభూషణైః భూషితః
సమావహతి కూరరాట్ అఖిలలోకనేత్రోత్సవమ్ ॥



47. మహార్ఘముకుటోజ్జ్వలః స్ఫురదుదారహారావలిః
విలోలమణికుండలోల్లసితపీనగండస్థలః ।
విచిత్రకుసుమావలీకలితదివ్యమాల్యాంచితః
విభాతమధురాకృతిః జయతి కూరరాట్ దేశికః ॥

48. ఉపారూఢే భానా వుదయ మధిరుహ్యానుదివసం
విచిత్రా మాందోళం వివిధమణిభిః కాంచనమయీమ్ ।
అలం కుర్వన్ వీధీః అనుపదకృతాకల్పసుభగాః
సమింధే కూరేశో మకరమహకాలేఽతిరుచిరః ॥

49 సమాస్థాయ శ్రీమాన్ నిశి నిశి భుజాభోగ్య మతులం
మహాయానం బ్రహ్మప్రభ మఖిలభూషాంచితతనుః ।
త్రయీగాథాసక్తైః నిబిడసవిధో వైష్ణవవరైః
చరన్ శ్రీవత్సాంకో జయతి విశిఖాం కూరనగరే ॥

50. సతాంబూలైః గంధైః కుసుమసహితైః భక్ష్యనివహైః
గుడాన్నాద్యై రన్నైరపి నిజమహాస్వాదమహితైః ।
కృతార్థా నాతన్వన్ నిఖిలమనుజాన్ కూరనృపతిః
స్వజన్మర్క్షే హస్తే మకరమహకాలే విజయతామ్ ॥

51. శ్రీమతా శుద్ధసత్త్వేన దొడ్డార్యేణ మహాత్మనా ।
పంచాశత్ కూరనాథస్య స్తోత్ర మీరిత ముత్తమమ్ ॥



# ఉపోద్ఘాతం

ఈ స్తుతిని రచించిన దొడ్డయాచార్యులవారి ఆచార్యులైన శ్రీశైలలక్ష్మణముని అనే మహనీయులు వానమామలై మఠానికి చెందినవారు అని క్రీ.శ. 1922వ సం॥లో అ.వీ. నరసింహాచార్యస్వామివారు తాము ప్రచురించిన స్తోత్రార్ణవం తృతీయ తరంగంలోని 88వ పేజీలో అధస్సూచికలో తెలుపడంచేత స్పష్టపడుతున్నది.

ఈ శ్లోకంలో సూచింపబడ్డ శ్రీశైలలక్ష్మణముని - శ్రీ పెరుంబూదూరులో ఎమ్బార్ జీయర్ మఠాన్ని స్థాపించిన మొదటి జీయర్ అయిన తిరువేఙ్గడ రామానుజ జీయర్ స్వామియే అని **యతిరాజపాదుకా** తమిళమాసపత్రికా సంపాదకులు ఉ.వే. **శ్రీమాన్ డా. వి.వి. రామానుజమ్** స్వామివారు అభిప్రాయపడ్డారు.

ఈ స్తోత్రకర్త అయిన శుద్ధసత్త్వమ్ దొడ్డయాచార్యస్వామివారు **సదనుష్ఠాన దర్పణమ్** అనే గ్రంథాన్ని అనుగ్రహించిన **శుద్ధసత్త్వమ్ తిరువాయ్మొழி అణ్ణన్ స్వామికి** తండ్రి. వీరిద్దరికి శ్రీపెరుమ్బూదూర్ ఒన్గాన ఎమ్బార్ జీయర్ స్వామి సన్నిధిలో సంప్రదాయ గ్రంథాన్వయం కలిగింది - అని శ్రీరంగనివాసం చేసే ఉ.వే. శ్రీమాన్ కందాడై శిఱుప్పులియూర్ తిరువాழி అణ్ణన్‌స్వామి తెలియజేశారని **"శ్రీవైష్ణవసింహ" ఉ.వే. శ్రీమాన్ టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారు** తమ ద్రావిడ వ్యాఖ్యలో తెలిపారు.

ప్రస్తుతవివరణం శ్రీమాన్ టి.ఏ. కృష్ణమాచార్యస్వామి (తిరుపతి) వారు ద్రావిడంలో కృపజేసిన వ్యాఖ్యను కృతజ్ఞతాపూర్వకంగా అనుసరిస్తూ రచింపబడు తున్నది. కూరేశులు అవతరించి వేయి సంవత్సరాలు పూర్తి అయ్యే శుభ సందర్భంలో కూరేశుల పాదపద్మాలలో దాసుడు సమర్పించే చిఱువాచిక కైంకర్యం ఇది. ఇందులోని దోషాలను దాసుని అజ్ఞాన ప్రమాదకృతాలుగా భావించి అనుగ్రహించ వలసినదిగా సహృదయపాఠకులను వేడుతున్నాను.



# తనియన్

**శ్రీశైలలక్ష్మణమునే శ్చరణాబ్జభృంగం**
**శ్రేయస్కరం తనుభృతా మఖిలాఘహంతృ ।**
**నత్వా కరోమి విబుధావలితుష్టయేఽహం**
**కూరాధిపస్తుతి మిమాం కుశలప్రదాత్రీమ్ ॥**

**తనుభృతాం =** శరీరాన్ని ధరించే మానవులకు, **శ్రేయస్కరం =** మంచిని కల్గించ గలిగేది, **అఖిల + అఘహంతృ =** అన్ని పాపాలను నశింపజేయగల్గినది అయిన, **లక్ష్మణమునేః =** శ్రీశైలలక్ష్మణ (తిరువేంకటరామానుజ) మునియొక్క, **చరణ + అబ్జయుగ్మం =** శ్రీ పాదపద్మాల జంటను, **నత్వా =** నమస్కరించి, **అహం =** దాసుడ నైన నేను, **విబుధ + ఆవలి తుష్టయే =** శ్రీవైష్ణవసమూహంయొక్క సంతోషంకోసం, **ఇమాం =** ఈ, **కుశలప్రదాత్రీం =** క్షేమాన్ని కల్గించగలిగే, **కూరాధిపస్తుతిం =** కూరత్తాழ்வాన్ స్తోత్రాన్ని, **కరోమి =** రచిస్తున్నాను.

శ్రీ శుద్ధసత్త్వం దొడ్డయాచార్యస్వామివారు తాము రచించాలని తలపెట్టిన **"కూరనాథ పంచాశత్"** అనే కూరేశుల విషయంలో 50 శ్లోకాలను కల స్తోత్రం నిర్విఘ్నంగా పరిసమాప్తి పొందడంకోసం తమ ఆచార్యులైన శ్రీశైలలక్ష్మణమునికి నమస్కరించి, శ్రీవైష్ణవుల ఆనందం ఒక్కటే ఫలంగా తలచి, ఆ గ్రంథాన్ని తాము రచిస్తున్నట్లు ఈ శ్లోకంలో సూచిస్తున్నారు. ఈ తనియన్‌లో వారి పేరు ప్రస్తావింప బడకపోయినా ఈ స్తుతి చివరలో కనబడుతున్న **"శ్రీమతా శుద్ధసత్త్వేన దొడ్డార్యేణ మహాత్మనా, పంచాశత్ కూరనాథస్య స్తోత్ర మీరిత ముత్తమమ్"** అనే శ్లోకాన్నిబట్టి, ఈ గ్రంథాన్ని రచించిన వారు శ్రీశుద్ధసత్త్వం దొడ్డయాచార్యస్వామివారే అని స్ఫుటమవు తున్నది.

**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమతే కూరనాథాయ నమః**



### శ్రీ శుద్ధసత్త్వం దొడ్డయాచార్యులవారు అనుగ్రహించిన

# కూరనాథ పంచాశత్

## - శ్రీపదపరిచర్యావ్యాఖ్యానము

1. **జయ! జయ! యతిరాజశ్రీపదాంభోజయుగ్మ -**
**ప్రసృమరమకరందాస్వాదలుబ్ధాంతరంగ।**
**జయ! జయ! కుమతేభవ్రాతహర్యక్ష! విద్వ**
**న్మణివర! నిగమాంతాకల్ప! కూరాధినాథ॥**

**యతిరాజశ్రీపదాంభోజయుగ్మ ప్రసృమర మకరంద + ఆస్వాదలుబ్ధ + అంత రంగ =** యతిరాజులైన భగవద్రామానుజుల శ్రీపాదపద్మాల జంటనుండి ప్రవహించే తేనెను ఆస్వాదించడంలో ఆశను కల మనస్సును కల్గినవాడా!, **కుమత + ఇభవ్రాత హర్యక్ష! =** నీచమతస్థులనే గజాల సమూహానికి సింహంవంటివాడా!, **విద్వన్మణి వర =** పండితశ్రేష్ఠులలో గొప్పవాడా!, **నిగమాంత + ఆకల్ప =** వేదాంతాలకు భూషణంవంటివాడా!, **కూరాధినాథ =** కూరేశా!, **జయ జయ =** మీరు అందరికంటే గొప్పగా ప్రకాశించాలి.

శ్రీశుద్ధసత్త్వం దొడ్డయాచార్యస్వామివారు కూరేశులనుగూర్చిన ఈ స్తుతి ప్రారంభంలోనే వారికి మంగళాశాసనాన్ని చేస్తున్నారు- **"జయ జయ"** అనే ఈ మొదటి శ్లోకంద్వారా.

భగవానుని శ్రీచరణపద్మాలనుండి స్రవించే తేనె గంగయే అని అన్నట్లే, భగవద్రామానుజుల శ్రీపాదపద్మాలనుండి స్రవించే తేనె వారి శ్రీపాదతీర్థం అని గ్రహించి దానిని స్వీకరించి ఆనందించడంలో ఆశను కలవారు కూరేశులు - అనే అర్థాన్ని గ్రహించవచ్చు. ఈ శ్రీపాదతీర్థాన్ని స్వీకరించిన మహిమవల్ల కూరేశులకు కల్గిన గొప్పదనం ఇకపై **"కుమితేభ"** ఇత్యాదిగా తెలుపబడుతున్నది. బాహ్యమతస్థులనే గజాలను జయించడంలో సింహంవలె ఉండడం, గొప్ప విద్వాంసులలో ఉన్నతులై ఉండడం, వేదాంతాకల్పులై ఉండడమే - ఆ అతిశయాలు. వీటిని



అన్నిటినీ కూరేశులు భగవద్రామానుజుల అనుగ్రహంవల్లనే పొందారు - అని తాత్పర్యం.

**"నిగమాంతానామ్ ఆకల్పః యేన సః"** అని బహుబ్రీహిసమాసంగా గ్రహించి, వేదాంతాలకు అలంకారాన్ని కల్గించినవారనే అర్థాన్ని చెప్పవచ్చు. నిగమాలకు - అంతాలు- వేదాలకు అంతాలు- అంటే - ఉపనిషత్తులు. ఆ ఉపనిషత్తులు అనే కన్యక కంఠంలో ప్రధానం అయిన అలంకారాన్ని, అంటే - మంగళసూత్రాన్ని, మంగళసూత్రంవంటి పంచస్తవిని అనుగ్రహించినవారు - అనేది దీని భావం. ఒక కన్య మెడలో ఒకడు తాళిని కట్టినట్లయితే ఆమెకు అతడు భర్త అని అందరికీ తెలుస్తుందికదా! వేదాంతాలు అనే కన్యకకు శ్రీమన్నారాయణుడే భర్త అని అందరికీ తెలియడంకోసం కూరేశులు శ్రీరంగేశపురోహితులు కనుక అయిదు స్తవాలు అనే మంగళసూత్రాన్ని సిద్ధం చేసి, దానిని శ్రీరంగనాథుని శ్రీహస్తానికి అందించి, వేదమాత కంఠంలో అతడు కట్టేటట్లు చేశారు - అని ఇక్కడి భావచమత్కారం.

భగవానుడు వేద కాంతయొక్క భర్త అని ఏవిధంగా కూరేశులు తెలిపారు? అంటే, ఉపనిషత్తులలో శ్రీమన్నారాయణుడే పరతత్త్వంగా తెలియజేయబడ్డాడని నిరూపించడం ద్వారా ఈ కార్యాన్ని చేశారు- అని తాత్పర్యం. ఒక కాంత ఎవనిని ఉన్నతునిగా తలుస్తుందో, అతనినే కదా తనకు భర్తగా వరిస్తుంది. వేదాలలో కొన్నిచోట్ల బ్రహ్మరుద్రాదులనుకూడ పరతత్త్వంగా చెప్పడంవల్ల వాస్తవానికి పరతత్త్వం ఎవరు? అనే విషయాన్ని సామాన్యులు తెలియలేరు. కనుక, ఉభయ మీమాంసాన్యాయాలను బట్టి, ఇతిహాసపురాణాలనుబట్టి భగవద్రామానుజులు శ్రీమన్నారాయణుడే పరతత్త్వం అని తమ గ్రంథాలలో స్థిరీకరించడాన్ని చక్కగా గ్రహించిన కూరేశులు దానిని వ్యక్తీరించడంకోసం తాము అనుగ్రహించిన స్తవాలను - శ్రీమన్నారాయణుడే వేదానికి భర్త అయిన పరతత్త్వం అనే విషయాన్ని సూచించే తాళిగా సిద్ధం చేసి, ఆ వేదాలకు గొప్ప అలంకారంగా కట్టించారు. అందువల్ల వేదాలకు ముఖ్యమైన అలంకారం అయిన మాంగల్యసూత్రాన్ని సృష్టించినవారు కూరేశులు కనుక, వారు **"నిగమాంతాకల్ప"** అని చెప్పబడ్డారు.

ఇక, **"నిగమాంతాః ఆకల్పాః యస్య సః"** అనే రీతిలో బహుబ్రీహిసమాసాన్ని చెప్పినట్లయితే, కూరేశులు వేదాంతాలను అలంకారంగా గ్రహించినవారు అనే అర్థాన్ని చెప్పవచ్చు. బంగారంతో చేసిన ఆభరణం శరీరాన్ని ప్రకాశింపజేసే అలంకారం. కూరేశుల జ్ఞానాన్ని ప్రకాశింప జేసే ఆభరణం వేదాంతాలు. కనుక ఈ రీతిలో చెప్పడంలో అడ్డు లేదు.

ఇటువంటి వేదాంతజ్ఞానాన్ని కల్గి ఉండడంచేత, అన్యదేవతలు పరతత్త్వం అని పలికే బాహ్యమతాలను జయించడంవల్ల, కుమతాలనే గజాలకు కూరేశులు సింహం అని చెప్పబడ్డారు. ఈ విధంగా వేదాంతాలను చక్కగా గ్రహించి, వాటిని సరిగా తెలియని బాహ్యమతాలను జయించడంవల్ల పండితశ్రేష్ఠులలో ముఖ్యులుగా కూరేశులు తెలుపబడ్డారు. **"యతిరాజ శ్రీపదాంభోజ --- లుబ్ధాంతరంగ"** అనే సంబోధనవల్ల కూరేశుల షట్పద రూపణం ధ్వనిస్తున్నది.

శ్రీపరాశర భట్టర్ ప్రణీతాలైన ముక్తకశ్లోకాలు, వాటి వ్యాఖ్యాన రూపాలైన కట్టియాలు శ్రీరంగంలో శ్రీరంగనాథుని అభిషేకసమయంలో భట్టర్ వంశీయులచేత అనుసంధింపబడడం అనూచానంగా ఈనాటికీ వస్తున్నది. ఈ శ్లోకాలలో శ్రీరంగనాథుడు పలు రీతులుగా రూపింపబడడం ద్వారా స్తుతించబడ్డాడు. సహృదయానందకోసం వాటిలో శ్రీరంగనాథుని తుమ్మెదగా, నిరూపించే శ్లోకం ఇక్కడ ఉట్టంకింపబడుతున్నది. **"అంతఃస్థిత స్సుమనసా మమరేశరత్నచ్ఛాయావికల్పితరుచిః నయనాభిరామః, ఆపాదితస్మరగుణః ప్రథితప్రచారః శాఖాసు రంగనృపతి ర్మధుపో విభాతి"** అనే శ్లోకంలో శ్రీరంగనాథుడు తుమ్మెదగా రూపణం చేయబడ్డాడు.

**"యతీనాం రాజా - యతిరాజః"**- యతులకు - అంటే - సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించినవారికి ప్రభువు. **హరిణీ అక్షే యస్య సః - హర్యక్షః** - పచ్చని కన్నులను కల్గి ఉండడంవల్ల సింహం హర్యక్ష మనబడుతున్నది. **కూరాధినాథః** - **"కూరమ్"** అనే ఊరికి ప్రభువు. కూరత్తాళ్వాన్ అని సంప్రదాయంలో వీరి ప్రసిద్ధనామం.

2. **జయతి జగతి నైజోద్వేలమేధావిశేషాత్**
**అధిగతతమబోధావాసవృత్త్యర్థజాలః ।**
**జనితయతివరేణ్యస్వాంతనిస్సీమమోదః**
**శ్రితజనపరిరక్షాదీక్షితః కూరనాథః ॥**

**నైజ + ఉద్వేల మేధావిశేషాత్** = తమకు సహజంగా ఉండే, అవధికి మించిన జ్ఞానవైభవంవల్ల, **అధిగతతమబోధావాసవృత్తి + అర్థ జాలః** = చక్కగా తెలియబడిన, బోధాయనముని రచించిన వ్యాససూత్రవృత్తియొక్క అర్థ సమూహాన్ని కలవారు, (అందువల్ల), **జనితయతివరేణ్యస్వాంత నిస్సీమమోదః** = కలుగ జేయబడిన యతిరాజుల చిత్తంలో అంతు లేని ఆనందాన్ని కలవారు, **శ్రితజనపరిరక్షాదీక్షితః** = తమను ఆశ్రయించిన జనులను చక్కగా కాపాడడం అనే వ్రతదీక్షను కలవారు అయిన, **కూరనాథః** = కూరేశులు, **జగతి** = లోకంలో, **జయతి** = సర్వోత్కర్షతో వెల్గుతున్నారు.



మొదటి శ్లోకంలో భగవద్రామానుజుల శిష్యులు అయిన కూరేశులు ఆ ఆచార్యశేఖరులపట్ల భక్తిని కలవారై, తత్ఫలంగా పలు అతిశయాలను పొందడాన్ని గూర్చి పల్కి, తరువాత ఈ రెండవ శ్లోకంలో భగవద్రామానుజులకు వీరు చాల ఆనందాన్ని కల్గించడానికి గల కారణాన్ని స్తుతికర్త తెలుపుతూ నిరూపిస్తున్నారు.

వేదవ్యాసభవానుడు రచించిన బ్రహ్మసూత్రాలకు బోధాయన మునివరులు చాల స్పష్టంగా వ్రాసిన వృత్తి అనే వివరణగ్రంథం - భగవద్రామానుజులకు బ్రహ్మ సూత్రవ్యాఖ్యానం అయిన శ్రీభాష్యాన్ని రచించడంలో ఆవశ్యకం అయింది. అందు కోసం ఆ ఆచార్యులు కాశీనగరంలో ఉండే గ్రంథాలయానికి కూరేశులతో పాటు వెళ్ళి, ఆ వృత్తిగ్రంథాన్ని సంపాదించి, కొంచె కొంచెంగా పరిశీలించి చూచినపుడు, కూరేశులు - ఏ యే భాగాన్ని భగవద్రామానుజులు చూచారో - ఆ భాగాన్ని తాము కూడ పఠించారు. అంతేకాక, రాత్రి సమయంలో మిగిలిన గ్రంథభాగాన్ని పూర్తిగా పఠించి, దానిని మనస్సులో జ్ఞాపకం పెట్టుకున్నారు. తిరిగి శ్రీరంగానికి భగవద్రామానుజులతోపాటు వచ్చి వారు శ్రీభాష్యాన్ని రచించేటప్పుడు శ్రీరామానుజు లకు ఆ వృత్తిని విన్నపించి, వారి మనస్సులో చాలా సంతోషాన్ని కల్గించారు - అనే చరిత్ర ఇక్కడ అనుసంధేయం.

ఈ విధంగా ఆచార్యునకు సంతోషాన్ని కల్గించిన కూరేశులు తమను ఆశ్రయించినవారిని కాపాడడంలో ఏమి ఆశ్చర్యం ఉన్నది? **బోధావాసః -** జ్ఞానానికి ఆశ్రయం అయిన బోధాయనమహర్షి. అయనశబ్దం, ఆవాసశబ్దం పర్యాయపదాలు.

3. **జయతి హరిపరత్వస్థాపనోద్వేలమోదాత్**
**ఉపనిషదుపగూఢాన్ న్యాయతోఽర్థాన్ వివృణ్వన్ ।**
**అధరితశివపారమ్యార్థిచోలాధిరాజః**
**శమితవిమతవాదః శాంతిమాన్ కూరనాథః ॥**

**హరిపరత్వస్థాపన + ఉద్వేలమోదాత్ =** శ్రియఃపతియొక్క పరత్వాన్ని సుస్థిరం చేయడంలోని అంతు లేని ఆనందం వల్ల, **ఉపనిషత్ + ఉపగూఢాన్ =** ఉపనిషత్తు లలో గుప్తంగా ఉండే, **అర్థాన్** = అర్థాలను, **న్యాయతః =** ఉభయ మీమాంసా న్యాయాలద్వారా, **వివృణ్వన్ =** వివరిస్తూ, **అధరితశివపారమ్య + అర్థిచోలాధిరాజః=** శివుని పరత్వాన్ని తమవల్ల వినాలని కోరిన చోళరాజును జయించినవారు, (తత్కారణంగా), **శమితవిమతవాదః =** శివుడే పరతత్త్వం అని వాదించేవారి ఎదురు వాదాన్ని ఉపశమింపజేసినవారు, **శాంతిమాన్ =** క్షమను కలవారు అయిన, **కూరనాథః =** కూరత్తాళ్వాన్, **జయతి =** సర్వోత్కర్షతో వెలుగు తున్నారు.

మొదటి శ్లోకంలో **"విద్వన్మణివర"** అని, **"కుమతేభహర్యక్ష"** అని పల్కిన రెండు అంశాలలో మొదటిది అయిన, పండితశ్రేష్ఠులలో ముఖ్యులై ఉండడాన్ని గూర్చి, రెండవ శ్లోకంలో కూరేశులు బోధాయనవృత్తిగ్రంథంయొక్క అర్థాన్ని చక్కగా తెలిసినవారు అని పల్కి ఉపబృంహణం చేసి, రెండవ విషయం అయిన - విమత మతస్థులనే గజాల సమూహాలకు సింహమై ఉన్నవారు- అనే విషయాన్ని ఈ మూడవ శ్లోకంలో - చోళరాజును జయించి, శైవుల వాదాన్ని నిర్మూలించినవారని పల్కడం ద్వారా ఉపబృంహణం చేస్తున్నారు.

''శివుడే పరతత్త్వం- అని వ్రాసి, దాని కింద మీరు సంతకం పెట్టి ఇవ్వండి'' అని తమను కోరిన చోళరాజు సమక్షంలో అతని కోర్కెకు విరుద్ధంగా, ఉపనిషత్తులలో దాగి ఉండే, నారాయణుడే పరతత్త్వం అనే విషయాన్ని జైమినియొక్క కర్మమీమాంసాసూత్రాలలోను, వ్యాసుల బ్రహ్మమీమాంసాసూత్రాలలోను ఉండే యుక్తుల ఆధారంగా స్థిరీకరించి, ఆ చోళరాజును జయించి, అంతటితో ఆగకుండా ఆ సభలో ఉండే శైవుల వాదాన్ని నిర్వీర్యం చేసినవారు - అనే సుప్రసిద్ధచరిత్ర ప్రకృతశ్లోకంలో ప్రస్తావింపబడడాన్ని గ్రహించాలి.

పూర్వం తాము, మహాపూర్ణులు చోళరాజులవల్ల నేత్రాలను కోల్పోయే రీతిలో బాధను పొందినా, అతనిపట్ల ఏ విధమైన కోపాన్ని, కక్షను పెట్టుకోకుండా ఉండడం చేత కూరేశులను **"శాంతిమాన్"** అని నిర్దేశించడం చాల యుక్తం.

4. **భవజలధినిమగ్నోద్ధారణే బద్ధదీక్షః**
**కిము భువ మవతీర్ణః శ్రీపతిః కిన్ను సైన్యేట్।**
**ఉత శఠరిపు రిత్యుల్లిఖ్యమానో మహద్భిః**
**జయతి గుణవరేణ్యః కూరనాథో మహాత్మా॥**

**భవజలధినిమగ్న+ఉద్ధారణే** = సంసారం అనే జలధిలో లోపల బాగా మునిగి ఉన్నవారిని పైకి తీసికొని వచ్చి రక్షించడంలో, **బద్ధదీక్షః** = నియమాన్ని కలవారై, **భువమ్ అవతీర్ణః** = భూలోకంలో అవతరించిన, **శ్రీపతిః కిము** = శ్రియఃపతియా ఏమి?, **సైన్య+ఈట్ కిమ్ ను** = విష్వక్సేనులా ఏమి?, **ఉత శఠరిపుః** = నమ్మాళ్వారులా ఏమి; **ఇతి** = అని, **మహద్భిః** = పెద్దలచే, **ఉల్లిఖ్యమానః** = ఊహింపబడేవారు, **గురువరేణ్యః** = ఆచార్య శ్రేష్ఠులు, **మహాత్మా** = గొప్ప మనస్సును కలవారు అయిన, **కూరనాథః** = కూరత్తాళ్వాన్, **జయతి** = సర్వోత్కర్షతో వెలుగుతున్నారు.

ఇంతవరకు కూరేశులు రామానుజ భక్తి, జ్ఞానవైభవం, బాహ్యమతస్థులను అణచడంలోని శక్తిసామర్థ్యాలు తెలుపబడ్డాయి. ఇందులో కూరేశులు తమ గొప్ప



కరుణతో సంసారం అనే మహాసముద్రంలో పూర్తిగా మునిగి, దుఃఖపడుతున్న ఈ లోకులను తమ ఉపదేశాలతో, గ్రంథాల రచనతో ఉద్ధరించి పరమపదానికి చేర్చి ఆనందింప జేయాలి- అనే వ్రతాన్ని కలవారు అని తెలియజేయాలని తలచి, వారిని, అటువంటి వ్రతాన్నే కల్గిన శ్రియఃపతి, విష్వక్సేనులు, నమ్మాళ్వార్లు - అనే వారి అవతారంగా పెద్దలు ఉత్ప్రేక్షించడాన్ని దానికి సాక్షిగా ఉట్టంకిస్తున్నారు.

జన్మసముద్రాన్ని దాటి పరమపదాన్ని చేరడానికి సులభమైన మార్గం శరణాగతియే. శరణాగతిమంత్రం ద్వయం. దానిని మొట్టమొదట శ్రియఃపతి శ్రీదేవికి ఉపదేశించగా, శ్రీదేవి సేనైముదలియార్‌కు, విష్వక్సేనులు నమ్మాళ్వార్లకు ఉపదేశించగా, ఆ ఉపదేశం పరంపరగా కూరత్తాళ్వాన్‌కు అందింది. వారు ఆ ద్వయమంత్రాన్ని తమ శిష్యులకు నేరుగా ఉపదేశించడంమాత్రమే కాకుండా, దాని అర్థాన్ని పంచస్తవాల మూలంగా తెలిపి, అందు సులభమైన దారిలో పరమపదాన్ని చేరే రీతిని తెలిపారు. ఇటువంటి గొప్పతనాన్ని కల కూరేశులను సాధారణవ్యక్తిగా చెప్పడంలో ఏ మాత్రం తృప్తి లేని మన పెద్దలు ముందు ప్రస్తావింపబడ్డ శ్రియఃపతి, విష్వక్సేనుల, నమ్మాళ్వార్ల అవతారరూపంగా ఉత్ప్రేక్షించారు. ఈ ముగ్గురి అవతారంగా చెప్పడం శ్రీదేవికికూడ ఉపలక్షణం అని చెప్పవచ్చు. శ్రియఃపతి, శ్రీదేవి, విష్వక్సేనులు, నమ్మాళ్వార్లు - అనేది క్రమం. లోకులను ఉద్ధరించాలి అనే దయార్ద్ర భావం శ్రియఃపతికంటే శ్రీదేవికి, ఆమెకంటే విష్వక్సేనులకు, విష్వక్సేనులకంటే నమ్మాళ్వార్లకు అధికంగా ఉన్నదని చెప్పడంకోసం - అని గ్రహించాలి. వీరు ఎందుకోసం కూరేశులుగా అవతరించారు? అని ప్రశ్నిస్తే, ఆవశ్యకం అయినంతగా తమకు కరుణాభావం కలుగనందువల్ల, కూరేశులుగా అవతరిస్తే కరుణా సముద్రులైన భగవద్రామానుజులను ఆశ్రయించి, ఆ కరుణాభావాన్ని అధికంగా సంపాదించ వచ్చు- అని భావించి వారు ఈ రీతిలో అవతరించారు - అని చెప్పడంలో సారస్యం ఉన్నది - అని శ్రీమాన్ కృష్ణమాచార్యస్వామివారి వివరణం. **"శేషో వా సైన్యనాథో వా శ్రీపతి ర్వేతి సాత్త్వికైః, వితర్క్యాయ మహాప్రాజ్ఞైః"** అనే శ్రీరామానుజుల మంగళా శాసన శ్లోకార్థం దీనికి అనుగుణంగా స్మరణీయం.

5. **నిరవధికదయాబ్ధి ర్నాయ మావిర్భవేచ్చేత్**
**ఇహ భువి విమలాత్మా కూరనాథో మహీయాన్ ।**
**వివిధవిషయనక్రగ్రామజుష్టం కథం వా**
**భవజలనిధిపూరం నిస్తరేయుః జనౌఘాః ॥**

**నిరవధికదయా + అబ్ధిః** = అంతులేని కరుణాసముద్రునివంటివారు, **విమలాత్మా** = దోషరహితం అయిన మనస్సును కలవారు, **మహీయాన్** = అందువల్ల చాల గొప్పవారు, అయిన, **అయం కూరనాథః**= ఈ కూరేశులు, **ఇహ భువి** = ఈ భూలోకంలో, **న ఆవిర్భవేత్ చేత్** = అవతరించి ఉండి ఉండకపోతే, **వివిధవిషయ నక్రగ్రామజుష్టం** = పలు విధాలైన శబ్దాదివిషయాలు అనే మొసళ్ళ సమూహాలతో కూడుకొనిఉండే, **భవజలనిధిపూరం** = సంసారం అనే సముద్రంయొక్క ప్రవాహాన్ని, **జన + ఓఘాః** = మానవసమూహాలు, **కథం వా నిస్తరేయుః** = ఏ విధంగా దాటగలవు?

మొదటి శ్లోకంలో కూరేశులు జనులను సంసారసాగరంనుండి ఉద్ధరించాలనే వ్రతాన్ని కల్గి ఉండడాన్నిగూర్చి పల్కి, దానికి కారణంగా వారి అంతు లేని దయను గూర్చి ఈ శ్లోకంలో ప్రస్తావించి, ఇటువంటి దయను, వ్రతాన్ని కల కూరేశులు అవతరించి ఉండకపోతే లోకులు సంసారసాగరాన్ని ఏ విధంగా దాటగలిగేవారు? దాటడం సాధ్యం అయేది కానే కాదు- అని అంటున్నారు. లోకంలో సముద్రాన్ని దాటడం నావతో సాధ్యం. కాని ఇక్కడ సంసారసముద్రాన్ని దాటడం కూరేశులనే సముద్రంద్వారా సాధ్యమని అనడం ఒక ఉక్తిచమత్కృతి.

సంసారం అనే ఈ లోకప్రవృత్తిని సముద్రంగా రూపణం చేయడానికి తగినట్లు ఈ లోకంలో ఉండే శబ్దాదిలౌకికవిషయాలను మొసళ్ళుగా రూపించారు. సముద్రంలో పడినవారిని దరిచేరనియకుండా లోపలకు లాగి ముంచి వేసే మొసళ్ళవంటివి కదా- ఈ లోకంలో జన్మించినవారిని మోక్షానికి చేరనీయకుండా స్వరూపనాశాన్ని కల్గించే శబ్దాదివిషయాలు. మొసళ్ళు కేవలం రూపాన్ని మాత్రమే నాశనం చేయగలవు. కాని, శబ్దాదిలౌకికవిషయాలు స్వరూపాన్ని కూడా నాశనం చేయగలవు.

6. **సుచరితపరిపాకోఽస్మాదృశాం కిన్ను పద్మా-**
**కమితు రఖిలనేతుః ప్రేమసారః కృతాత్మా ।**
**విలసతి భువి కూరేశాత్మనోదీర్యమాణః**
**జయతి విబుధవర్యైః కూరనాథః కృపాలుః ॥**

**యః** = ఎవరు, **కూరేశాత్మనా** = కూరేశులనే రూపాన్ని పొందినవారుగా, **భువి విలసతి** = ఈ లోకంలో ప్రకాశిస్తున్నారో, సః **కృపాలుః కూరనాథః**= ఆ దయ అతిశయించిన కూరత్తాళ్వాన్, **అస్మాకం**= మా యొక్క, **సుచరితపరిపాకః** = పుణ్య ఫలంగా, **కృతాత్మా కిన్ను** = రూపాన్ని ధరించారా? (లేక), **పద్మాకమితుః** = శ్రియః పతియై, **అఖిలనేతుః**= సర్వేశ్వరుడనే భగవానుని, **ప్రేమసారః**= గొప్ప ప్రీతి, **కృతాత్మా కిన్ను** = రూపొందిందా ఏమి?, **ఇతి** = అని, **విబుధవర్యైః** = బ్రాహ్మణోత్తముల చేత, **ఉదీర్యమాణః**= పొగడబడేవారై, **జయతి**= సర్వోత్కర్షతో ప్రకాశిస్తున్నారు.



నాల్గవ శ్లోకంలో స్తుతికర్త శ్రియఃపతి, విష్వక్సేనులు, నమ్మాళ్వార్ - అనే వీరి అవతారంగా కూరేశులను కొందఱుపెద్దలు ఉల్లేఖిస్తున్నారని అన్నారు. ఈ శ్లోకంలో ఇంకా కొందరు మహానీయులు- మనం అందరం చేసిన పుణ్యంయొక్క ఫలమే కూరేశులుగా అవతరించిందా?, మన అందరిపట్ల భగవానునకు గల ప్రేమే కూరేశులుగా రూపొంది వచ్చిందా? అని పొగడుతున్నారని అంటున్నారు. ఈ రీతిలో పలువురు పలు రీతులలో ఉల్లేఖించడానికి కారణం ఏమి? అంటే, అయిదవ శ్లోకంలో చెప్పబడ్డ కూరేశుల అంతులేని కరుణే.

మనం చేసిన పుణ్యంయొక్క అతిశయంచేత మనపట్ల భగవానునకు ప్రీతి కల్గి, దానివల్ల అతడు మనలను ఉద్ధరించడంకోసం కూరేశులను అవతరింపజేశాడా? లేక, నిర్హేతుకంగానే మనపట్ల స్వామికి ప్రేమ కల్గి, ఆళ్వాన్‌ను అవతరింపజేశాడా? అని పల్కడం ఒక చమత్కారం. మనం చేసిన పుణ్యమే కూరేశులుగా రూపొంది వచ్చిందా? లేక, భగవానుని ప్రేమే కూరేశులుగా అవతరించి వచ్చిందా- అని అనుగ్రహించారు.

కూరేశులు అవతరించడానికి తగిన గొప్ప పుణ్యం మనం అందరం కలిసి చేసినా సాధ్యం కాదని పల్కి, భగవానుని గొప్ప ప్రేమే ఆళ్వాన్‌గా అవతరించిందా? అని మహనీయులు అంటున్నారని పలికారు. ఈ శ్లోకభావానికి అనుగుణంగా నమ్మాళ్వార్లను స్తుతిస్తూ భట్టర్ పల్కిన "**కృష్ణతృష్ణాతత్త్వ మివోదితమ్**" అనే సూక్తిని భగవద్రామానుజులను కీర్తించే "**పుణ్యాంభోజవికాసాయ**" అనేచోట సూక్తిని స్మరించాలి.

7. **అపహృతభవతాపః (పైః) పావనైః ప్రేమసాంద్రైః**
**అమృతరసనిదానైః ఆత్మభాజాం కటాక్షైః ।**
**అనుకల ముపకుర్వన్ శేముషీశేషతాయాః**
**జలధిదుహితృజానేః భ్రాజతే కూరనాథః ॥**

**కూరనాథః** = కూరేశులు, **ప్రేమసాంద్రైః** = ప్రేమతో దట్టమైనవి, **పావనైః** = పరిశుద్ధిని కలిగించేవి, **అమృతరసనిదానైః** = మోక్షానందానికి మూలకారణంగా ఉండేవి అయిన, **కటాక్షైః** = తమ కటాక్షాలతో, **ఆత్మభాజాం** = దేహాన్ని ధరించే జీవాత్మలకు, **జలధిదుహితృజానేః** = సముద్రరాజు కుమార్తె అయిన లక్ష్మీదేవియొక్క నాథునిపట్ల, **శేషతాయాః శేముషీం** = మనం అందరం శేషభూతులం- అనే జ్ఞానాన్ని, **అనుకలమ్ ఉపకుర్వన్** = ప్రతిక్షణం కల్గిస్తూ, (దానిచేత), **అపహృతభవతాపః** = వారి సంసారతాపాన్ని తీర్చేవారై, **భ్రాజతే** = వెలుగుతున్నారు.

సంసారసముద్రంలో మునిగిన జీవాత్మలను తమ దయతో కూరేశులు ఉద్ధరించడం ఏ విధంగా! అనే ప్రశ్న ఉత్పన్నం కాగా, దానికి సమాధానాన్ని ఈ శ్లోకంలో స్తుతికర్త పల్కుతున్నారు. తమ తిరుమేనిలో గల శ్రీహస్తాలను అందించి, వారిని ఉద్ధరించి పరమపదానికి చేర్చడం లేదు. ఇక మఱి ఏంచేస్తున్నారు? అని అంటే, జ్ఞానం అనే చేతిని ఇచ్చి, ఉద్ధరిస్తున్నారు అని అంటున్నారు కవి. **"ఞానక్కై తా"** అని అన్నారుకదా నమ్మాళ్వార్లు. లోకంలోని జనులకు "మనం స్వతంత్రులం కాము. స్వతంత్రులమై ఉంటే ఈ విధంగా మనం లౌకిక సుఖాన్ని అనుభవించవచ్చు. ఆ విధంగా అనుభవిస్తే దానివల్ల మనకు కలిగేది దుఃఖమే తప్ప ఇంకొకటి కలుగదు. మనం శ్రియఃపతికి శేషభూతులం. అటువంటి మనం మన దాస్యస్వభావానికి తగినట్లుగా ఆ స్వామినే శరణంగా ఆశ్రయించాలి. ఆ విధంగా ఆశ్రయిస్తే అతడు మనలను ఈ సంసారం నుండి విడిపించి పరమపదానికి చేర్చి, తన శ్రీచరణ కైంకర్యాన్ని అనుగ్రహించి, మనకు ఆనందాన్ని ఇస్తాడు" అని ఉపదేశించి, జ్ఞానాన్ని కల్గించి, తద్వారా పరమపదానికి కూరేశులు చేర్పిస్తారు - అని భావం. ఈ విధంగా జ్ఞానాన్ని కల్గించి, సంసార తాపాన్ని తీర్చేవారు అని మోక్షాన్ని కల్గించే రీతిని దీనిద్వారా తెలియజేశారు.

**"అపహృతభవతాపైః"**- అని తృతీయాబహువచనాంతరూపపాఠానికి అనుగుణంగా **"అమృత రసనిదానైః"** అనే పదాన్ని **"కటాక్షైః"** అనేదానికి విశేషణంగా చేసి, కూరేశులు కటాక్షం సంసారతాపాన్ని పోగొట్టి మోక్షానందాన్ని ఇస్తుంది- అనే అర్థాన్ని చెప్పాలి. అది చాల సరసం.

8. **కృతకువలయమోదః కోశభూతః కలానాం**
**ద్విజపతి రఖిలాశాః శోభయన్ నైజధామ్నా ।**
**ప్రశమితపరితాపః ప్రాప్య విష్ణోః పదం తత్**
**విలసతి విబుధేడ్యః కూరనాథౌషధీశః ॥**

**కృతకువలయమోదః** = 1) భూమండలానికి ఆనందాన్ని కల్గించినవారై, 2)కలువలకు ఆనందాన్ని కలిగించేవారై, **కలానాం కోశభూతః** = 1) శాస్త్రాలకు నిధి అయినవారై, 2) చంద్రకళలకు నిధి అయినవారై, **ద్విజపతిః** = 1) బ్రాహ్మణులకు అధిపతులై, 2) యాగానికి అవసరం అయిన ఓషధులను వృద్ధి చేయడంవల్ల యాగం చేసే బ్రాహ్మణులకు నాథులై, **నైజధామ్నా** = 1) తమ జ్ఞానప్రకాశంతో, 2)తన కాంతితో (వెన్నెలతో), **అఖిల + ఆశాః** = 1) అన్ని దిక్కులలో ఉన్నవారిని, 2) అన్ని దిక్కులను, **శోభయన్** = ప్రకాశింపజేస్తూ, **ప్రశమితపరితాపః** = 1) సంసార తాపాన్ని తీర్చేవారై, 2) సూర్యతాపాన్ని తీర్చేవారై, **విబుధ + ఈడ్యః** = 1) బ్రాహ్మణుల చేత స్తుతింపదగినవారై, 2) యాగానికి ఆవశ్యకం అయిన ఓషధులను వృద్ధి చేయడం వల్ల యాగంలో హవిస్సును స్వీకరించే దేవతలచే స్తుతింపబడదగినవారై, **తత్** = ప్రసిద్ధం అయిన, **విష్ణోః పదం ప్రాప్య** = 1) పరమపదాన్ని పొంది, 2) ఆకాశాన్ని చేరి, **కూరనాథ + ఓషధీశః** = కూరనాథులనే చంద్రుడు, **విలసతి** = విశేషంగా ప్రకాశిస్తున్నారు.



పూర్వ శ్లోకంలో కూరేశులను సంసారతాపాన్ని తీర్చేవారు- అని, జ్ఞానం అనే కాంతిని జనులకు ఇచ్చి ఉపకారం చేసేవారు- అనిఅన్నారు. సూర్యతాపాన్ని ఉపశమింప జేసి, వెన్నెల కాంతిని ప్రసరింపజేసే చంద్రునిగూర్చిన స్మరణ కలిగినందువల్ల ఆ చంద్రునకు, కూరేశులకు తగినట్లుగా రెండు రెండు అర్థాలను ఇచ్చే విశేషణాలను ప్రయోగించి, శ్లేషాలంకారప్రక్రియలో కూరేశులను చంద్రునిగా ఇందులో కవి రూపిస్తున్నారు.

ప్రతిపదార్థంలో 1) అనే సంఖ్యతో తెలుపబడ్డ అర్థాలు కూరేశులకు, 2) అనే సంఖ్యలో తెలుపబడ్డ అర్థాలు చంద్రునకు చెందినవి. కూరేశులు చంద్రుని వంటివారు- అని అంటే అది ఉపమాలంకారం. కూరేశులే చంద్రుడు- అని అంటే అది రూపకాలంకారం. శ్రీరంగనాథుని చంద్రునిగా నిరూపించే ఈ శ్లోకం సంవాదంగా ఉట్టంకింపబడుతున్నది. **"అనిశం కుముదం వికాసయంతం సతతం పూర్ణ మహర్నిశం చ దృశ్యమ్, అనుపప్లవ మద్య రంగరాజం మనుతే చంద్రమసం జన్యోఽనుమాస్యమ్".**

9 **సుజనహృదయపద్మోల్లాస మారాద్వితన్వన్**
**కుజనకువలయానాం మీలనం చాపి కుర్వన్**
**ఉదయ మధిగతోఽసౌ కూరనాథాంశుమాలీ**
**దురితతిమిరజాలం దేహభాజాం హినస్తి॥**

**అసౌ** = ఈ, **కూరనాథ + అంశుమాలీ** = కూరనాథులనే సూర్యుడు, **ఉదయం**= ఉదయాన్ని, **అధిగతః సన్** = పొందినవాడై, **ఆరాత్**= దూరంలో ఉండే, **సుజన హృదయం** = సత్పురుషుల హృదయం అనే, **పద్మ + ఉల్లాస** = పద్మంయొక్క వికాసాన్ని, **వితన్వన్** = విస్తరింపజేస్తూ, **కుజనకువలయానాం** = దుష్టులనే కలువల యొక్క, **మీలనం చాపి** = ముడుచుకొనిపోవడాన్ని, **కుర్వన్** = చేస్తూ, **దేహభాజాం**= శరీరాన్ని కలవారి, **దురితతిమిరజాలం** = పాపాలు అనే చీకటి సమూహాన్ని, **హినస్తి**= నశింపజేస్తున్నది.

పూర్వం కూరేశులను చంద్రునిగా వర్ణించిన కవి ఇందులో వారిని సూర్యునిగా రూపణం చేస్తున్నారు. సూర్య చంద్రులిద్దరూ ఆకాశంలోనుండి కాంతిని వ్యాపింప చేయడంవల్ల చంద్రునకు తర్వాత సూర్యుని స్మరించడం సహజమే కద!

పూర్వం కూరేశులను చంద్రునిగా రూపించినపుడు ఆ ఇద్దరికీ మధ్యగల సామ్యాలను శ్లేష ప్రక్రియలో రెండు అర్థాలను ఇవ్వగల పదాలద్వారా వివరించారు. ఇందులో విశేషణాలలో గల అర్థాలను - ఒకదానిని మఱొకటిగా రూపించి పల్కుతున్నారు. ఉదాహరణకు- **"కృతకువలయమోదః"** అనే ప్రయోగంలో **"కువలయమ్"** అనే పదానికి భూమండలం అని, కలువలు అని రెండర్థాలు ఉన్నందున ఒకే పదంతో ఇద్దఱికీ ఉండే సామ్యాన్ని చూపించినట్లయింది. ఇందులో **"కూరనాథాంశుమాలీ"** అని కూరేశులను సూర్యునిగా రూపించినట్లే, విశేషణాలలో కూడ **"సుజనహృదయపద్మోల్లాసమ్ వితన్వన్"**- (సుజనుల మనస్సు అనే తామరయొక్క వికాసాన్ని కల్గిస్తూ) అని ఈ రీతిగా సత్పురుషుల మనస్సునే తామరగా రూపిస్తూ పల్కడాన్ని గమనించాలి. సత్పురుషుల మనస్సును వికసింపచేసేవారు కూరేశులు; తామర పూవును వికసింపచేసేవాడు సూర్యుడు- అని ప్రత్యేక ప్రత్యేకంగా చెప్పకుండా మనస్సునే తామరగా రూపించారు కదా! ఈ విధంగానే మిగిలినవాని విషయంలోకూడా అన్వయించుకోవాలి. భట్టర్ శ్రీరంగనాథుని సూర్యునిగా రూపిస్తూ పల్కిన ఈ క్రిందిశ్లోకం అర్థసంవాదంగా భావ్యం. "**కుంకుమారుణ ముదంచిత శ్రియమ్ కోమలారుణసరోజసంస్థితమ్, రంగమందిర! తమోనివారణమ్ శంకతే తపనదీధితిం జనః**".

10 **అమృతజననభూమిః సంశ్రితానందదాయీ**
**సకలసుగణరత్నావాసభూః పూర్ణసత్త్వః ।**
**విమతకథకవర్యైః నావికై రప్యలంఘ్యః**
**స్ఫురతి భువి గభీరః కూరనాథామృతాబ్ధిః ॥**

**అమృత** = 1) మోక్షానికి, 2) అమృతానికి, **జననభూమిః** = జన్మభూమియై, **సంశ్రిత + ఆనందదాయీ** = తనను ఆశ్రయించిన 1) మముక్షువులకు, 2) ఇంద్రాది దేవతలకు ఆనందాన్ని 1) ఇచ్చేవారై, 2) ఇచ్చేదై, సకల **సుగుణరత్న+ఆవాసభూః**= అన్ని 1), సుగుణాలు అనే రత్నాలకు నిలయమై 2) అన్ని మంచిగుణాలు కల రత్నాలకు నిలయమై, **పూర్ణసత్త్వః** = 1) సత్త్వగుణం నిండినవారై, 2) మొసళ్ళు మొదలైన ప్రాణులతో నిండినదై, **విమతకథకవర్యైః** = 1) వాదించే బాహ్యమతస్థులచే, **అలంఘ్యః** = ఎదురించడానికి సాధ్యం కానివారై, 2) ఇతరులకు దాటడానికి సాధ్యం



కానిదైన, **గభీరః** = 1) గంభీరమైన మనస్సును కలవారై, 2) లోతును కల్గినదైన, **కూరనాథ + అమృతాబ్ధిః** = 1) కూరేశులనే 1) అమృత సముద్రం (పాలకడలి) **భువి**= భూమిలో, **స్ఫురతి** = ప్రకాశిస్తున్నది.

ఎనిమిదవ శ్లోకంలో కూరేశులను చంద్రునిగా రూపణం చేసిన కవి, ఇందులో వారిని ఆ చంద్రుడు ఉదయించిన పాలసముద్రంగా రూపిస్తున్నారు. ఇందులో కూడ 1) అనే సంఖ్యతో, 2) అనే సంఖ్యతో సూచింపబడినవి క్రమంలో కూరేశుల లోను, అమృతసముద్రంతోను పొసగుతాయి. ఇందులో **"అమృతజననభూమిః, పుణ్యసత్త్వః, అలంఘ్యః, గభీరః"**- అనే పదాలు రెండర్థాలను ఇచ్చే శ్లిష్టపదాలు. **"సుగుణరత్న, విమతకథకవర్యైః, నావికైః, కూరనాథామృతాబ్ధిః"** అనేవి సద్గుణాలు అనే రత్నాలు, బాహ్యమతస్థులు అనే నావికులు, కూరనాథులనే అమృత సముద్రం అనే అర్థాల్ని ఇవ్వడంవల్ల రూపకాలు. "**అమృతం యజ్ఞశేషే స్యాత్ పీయూషే సలిలే ఘృతే, అయాచితే చ మోక్షే చ**" అనే దీనిని ఘంటవచనాన్నిబట్టి అమృతం అనే పదానికి మోక్షం అని, అమృతం అని రెండు అర్థాలు. కూరేశులవల్ల శిష్యులకు మోక్షం లభిస్తుంది కనుక వారు మోక్షానికి ఆశ్రయభూతులు. సముద్రాన్ని మథించి దేవతలు అమృతాన్ని పొందడంచేత అది అమృతానికి నిలయమైనది. అందువల్ల కూరేశులు ముముక్షువులైన శిష్యులకు, సముద్రం ఇంద్రాదిదేవతలకు ఆనందాన్ని కల్గిస్తున్నారని తెలుపబడింది. ఇదే రీతిలో మిగిలినవాని విషయంలోకూడా అన్వయించుకోవాలి. శ్రీరంగనాథుని సముద్రంగా రూపిస్తూ భట్టర్ పల్కిన ఈ శ్లోకం ప్రకృతంలో అనుసంధేయం- "**మరకతమణిరమ్యం రమ్యమాణిక్యముక్తాఫల వాసితగాత్రం ప్రస్ఫురద్గంధవాహమ్, నిహితవివిధజంతుం ప్రోల్లసన్మీనలీలం సుగమజలనిధిం త్వాం మన్మహే రంగనాథ!**".

11. సదాఽభివృద్ధి మాశ్రితోఽక్షయోఽజడాశయోదయోఽ
**కలంకభావభాసురో నిరాకృతోగ్రసంగమః ।**
**విరాజమానవిగ్రహో దివాఽపి మిత్రసన్నిధౌ**
**వినాకృతాస్తసంశ్రయో విభాతి కూరరాడ్విధుః ॥**

**సదా అభివృద్ధిమ్ ఆశ్రితః** = ఎల్లప్పుడు వృద్ధిని పొందినవాడు, **అక్షయః** = క్షయాన్ని లేనివాడు, **అజడాశయః ఉదయః** = జలాశయం అయిన సముద్రంలో పుట్టినవాడు, బుద్ధిమంతుల మనస్సులో జనించేవాడు, **అకలంకభావభాసురః** = దోషం లేనందువల్ల ప్రకాశించేవాడు, **నిరాకృత + ఉగ్రసంగమః** = శివుని (శిరస్సుతో)తో సంగమాన్ని నిరాకరించినవాడు, **మిత్రసన్నిధౌ** = సూర్యుని సమీపంలో, **దివా అపి**=

పగటి కాలంలోకూడ, **విరాజమానవిగ్రహః** = ప్రకాశించే తిరుమేనిని కల్గినవాడు, **వినాకృత + అస్తసంశ్రయః** = పశ్చిమాద్రిని చేరి అస్తమించనివాడు అయిన, **కూరరాట్ విధుః** = కూరత్తాఝ్వాన్ అనే చంద్రుడు, **విభాతి** = వెలుగుతున్నాడు.

పూర్వం ఎనిమిదవ శ్లోకంలో కూరేశులను చంద్రునిగా రూపించి, చంద్రునివద్ద ఉండే స్వభావాలు అన్నీ కూరేశులలోకూడా ఉన్నాయి- అని చెప్పబడింది. ఇక, ఇందులో చంద్రునకు గల దోషాలు ఏవీ కూరేశులలో లేవు- అని చెప్పబడుతున్నది. ఈ దోషాలు చంద్రునిలో లేకపోతే, లేక, ఈ దోషాలు లేని చంద్రుడు ఒకడు ఉంటే, అపుడే కూరేశులను ఆచంద్రునిగా రూపణం చేయడానికి సాధ్యం- అని తాత్పర్యం. "**సదా**" అనే పదాన్ని అన్ని పదాలతో అన్వయించాలి. "**జలాశయః**" అనే పదం "**లడయో రభేదః**" అనే న్యాయానుసారం "**జడాశయః**" అని అయింది. "**జలాశయః**"- జలం ఉండే చోటు అయిన సముద్రం. "**జడః**"- అనే పదానికి జ్ఞానం లేనివాడనే అర్థాన్ని చెప్పి, "**అజడాశయః**" అనే పదానికి- జ్ఞానంలేని మానవుల మనస్సులో స్ఫురించకుండా, జ్ఞానాన్ని కలవారి మనస్సులో స్ఫురించే కూరేశులు అనే చంద్రుడు - అని అర్థం చెప్పడం సరసం. చంద్రునకు గల దోషాలు ఏవి? అని అంటే, కొన్ని దినాలు వృద్ధి చెందడం, మచ్చను కల్గి ఉండడం, ఉగ్రుడైన - అంటే - మిక్కిలి కోపాన్ని కల శివుని శిరస్సుపై నిలచి ఉండడం, పగలు సూర్యుడు పక్కన ఉన్నపుడు తేజోవిహీనుడై ఉండడం, పశ్చిమాద్రిలో అస్తమించడం- మొదలైనవి. "**అమృతప్రభవం ప్రభాప్రభావప్రహితధ్వాంతలసద్విలాసజాతమ్, సకలం సకలానుమోదహేతుం శశినం త్వాం కలయామి రంగరాజ!**" అనే భట్టర్ ముక్తకం ప్రకృత శ్లోకానికి సంవాదంగా భావ్యం.

12. **ప్రసాద మేయివాన్ సదా ప్రకామవీక్ష్యవిగ్రహః**
**ప్రమోద మావహన్ నృణాం ప్రణాశయం స్తమస్తతిమ్ ।**
**సదోత్తరాయణాన్వితో విముక్తతామసగ్రహః**
**త్రయీమయోఽత్ర కూరరాట్ దివాకరో విరాజతే ॥**

**సదా** = ఎల్లప్పుడు, **ప్రసాదమ్ ఏయివాన్** = 1) అనుగ్రహాన్ని పొందినవారై, 2) ఉగ్రంగా కాకుండా ప్రసన్నతను పొందినవాడై, **ప్రకామవీక్ష్యవిగ్రహః** = 1) చక్కగా సేవించదగిన తిరుమేనిని కలవారై, 2) కన్నులు సందేహించకుండా దర్శించదగిన బింబాన్ని కల్గినవాడై, **నృణాం ప్రమోదం ఆవహన్** = మానవులకు చక్కని జ్ఞానాన్ని కల్గించేవారై, 2), మానవులకు నిద్రనుండి ప్రబోధాన్ని పొందించేవాడై, **తమః తతిం ప్రణాశయన్** = 1) అజ్ఞానసమూహాన్ని నశింపజేసేవారై, 2) చీకటి గుంపును



నశింపజేసేవాడై, **సదా** = ఎల్లప్పుడు, **ఉత్తరాయణమ్ + అన్వితః** = 1) గొప్ప మార్గంలో చేరినవారై, 2) ఉత్తరాయణంలో చేరినవాడై, **విముక్తతామస గ్రహః** = 1) తమోగుణాన్ని కల్గినవారిచే విడువబడినవారై, 2) రాహువుచే పట్టుకొనబడనివాడై, (గ్రహణం లేని వాడై), **త్రయీమయః** = 1) వేదవిచారాన్ని చేయడంవల్ల వేదమయులై, 2) మూడు వేదాలను రూపంగా కల్గినవాడై ఉండే, **కూరరాట్ దివాకరః** = కూరేశులనే సూర్యుడు, **అత్ర** = ఈ లోకంలో, **విరాజతే** = విశిష్టంగా ప్రకాశిస్తున్నాడు.

గత శ్లోకంలో కూరేశులను దోషాలు లేని చంద్రునిగా రూపించినట్లే, ఇందులో ఆ ఆచార్యవర్యులను దోషరహితుడైన సూర్యునిగా రూపణాన్ని చేస్తున్నారు. తొమ్మిదవ శ్లోకంలో కూడ "**కూరనాథాంశుమాలీ**" అని సూర్యునిగా రూపించడం స్మరించదగినది. ఈ శ్లోకంలో కూడ "**సదా**" అనే పదాన్ని మిగిలిన అన్ని పదాలతోను అన్వయించుకొని అర్థం చెప్పుకోవాలి.

సూర్యునకు దోషాలు ఏమి? అని అంటే, కొన్ని సమయాలలో ఉగ్రంగా ఉండడం, తత్కారణంగా కొంచెం కూడా దర్శించడానికి సాధ్యం కాకుండా ఉండడం, సత్కార్యాలను చేయకూడని దక్షిణాయనంతో సంబంధాన్ని కల్గి ఉండడం, రాహువుచే పీడింపబడి, గ్రహణమోక్షాన్ని కొంతకాలానికి పొందడం- మొదలైనవి. చీకటి సమూహాన్ని పోగొట్టడం, వేదమయుడై ఉండడం గుణమే అయినా, దోషాలే ఎక్కువ- అని తాత్పర్యం. ఇటువంటి దోషాలు లేని ఒక సూర్యుడు ఉంటే, అపుడే కూరేశులను సూర్యునిగా రూపణం చేయడం సాధ్యం - అన్నది ఇచటి పరమార్థం.

13. **స్వకీయహృద్గుహాశయాళుసారసాక్షకేసరీ**
**పరీతవాగ్ఝరీభరో విరక్తముఖ్యసంశ్రయః ।**
**విశేషశాస్త్రయుక్తిభిః విచిత్రధాతుభిర్యుతః**
**విభాతి కూరరాణ్మహీధరః పుమర్థసిద్ధయే ॥**

**స్వకీయ హృద్గుహాశయాళు సారసాక్షకేసరీ** = తనయొక్క హృదయం అనే గుహలో పరుండి నిద్రించే పుండరీకాక్షుడనే (శ్రియఃపతి అనే) సింహాన్ని కల్గినది, **పరీత వాగ్ఝరీభరః** = పూర్ణ సూక్తులనే వాగులను నిండుగా కల్గినది, **విరక్త ముఖ్య సంశ్రయః** = ఆశ లేనివారికి ముఖ్యమైన ఆశ్రయం, **విశేషశాస్త్రయుక్తిభిః** = పరిపూర్ణాలైన శాస్త్రయుక్తులనే, **విచిత్రధాతుభిః** = పలు రీతులలోని ధాతువులతో, **యుతః** = కూడినది అయిన, **కూరరాట్ మహీధరః** = కూరేశులనే పర్వతం, **పుమర్థసిద్ధయే** = మన మోక్షపురుషార్థం సిద్ధించడంకోసం, **విభాతి** = గొప్పగా ప్రకాశిస్తున్నది.

సూర్యచంద్రులు ఉదయించడం, అస్తమించడం పర్వతాలపైనే కనుక, పర్వత స్మరణం కలుగగానే స్తుతికర్త ఈ శ్లోకంలో కూరేశులను ఒక అద్వితీయమైన, అలౌకికమైన పర్వతంగా రూపణం చేస్తున్నారు. పర్వతగుహలలో సింహాలు పరుండి నిద్రిస్తాయి. కూరేశుల హృదయంలో సారసాక్షు (పుండరీకాక్షు) డనే నృసింహస్వామి వారి ధ్యానానికి విషయభూతుడై శయనించి ఉన్నాడు. కూరేశుల తిరువారాధనలో అర్చామూర్తివిగ్రహం నృసింహమూర్తి అని పెరియతిరుముడియడైవు అనే సంప్రదాయ చరిత్ర గ్రంథంలో ఉన్నది. శ్రీసూక్తి వర్షాన్ని కురిపించేవారు కూరేశులు. (కొండ) వాగుల నీరు పర్వతంపై నిండుగా ప్రవహిస్తుంది. గొప్ప శాస్త్రయుక్తులను నిండుగా కల్గినవారు కూరేశులు. గైరికాది ధాతువులకు, సువర్ణాది లోహాలకు ఆశ్రయం పర్వతం. ఇటువంటి కూరేశులు. శిష్యులకు మోక్షం అనే పురుషార్థం సిద్ధించడంకోసం ప్రకాశిస్తున్నారు. ఇటువంటి కూరేశులనే పర్వతం తనలో నివసిస్తూ తపస్సు చేసేవారి తపస్సుయొక్క ఫలంగా ధర్మార్థకామ మోక్షాలనే పురుషార్థాల సిద్ధికోసం ప్రకాశిస్తున్నది. ఇటువంటి సామ్యాలను దృష్టిలో పెట్టుకొని స్తుతికర్త కూరేశులను పర్వతంగా రూపించారు. అదే రీతిలో విశేషణపదాలలోకూడ హృదయమనే గుహ, భగవానుడనే సింహం, శ్రీసూక్తులనే ప్రవాహాలు, (కొండవాగులు), శాస్త్రయుక్తులనే పలు విధాలైన ధాతువులు - అని ఈ విధంగా రూపణాన్ని నిర్వహించడం గమనించదగినది. **"సత్త్వోన్నతః సకలసత్త్వనివాసభూమిః సౌవర్ణరమ్యవిభవ స్సుమనోమనోజ్ఞః, సద్వృత్త సంఘసమధిష్ఠితపార్శ్వదేశః శైలాత్మనా స్ఫురసి రంగమహేశ్వర! త్వమ్"** అనే భట్టర్ ముక్తకం భావ్యం.

14. **యతీశవాక్సుధాఝరీ సదానుభూతిమత్తధీః**
**త్రయీశిరోఽర్థగుంభితాః సుయుక్తిసాయకావలీః ।**
**సృజన్ కువాదివిద్విషః ప్రకాలయన్ గురోః పదేఽ**
**భిషిక్త ఏష కూరరాట్ ప్రశాస్తి వైష్ణవీం శ్రియమ్ ॥**

**యతీశవాక్ సుధాఝరీ సదా అనుభూతి మత్తధీః** = యతిరాజుల శ్రీసూక్తులనే అమృతంయొక్క ప్రవాహాన్ని ఎల్లప్పుడూ అనుభవించడంవల్ల గర్వాన్ని పొందిన బుద్ధిని కలవారై, **త్రయీశిరోఽర్థగుంభితాః** = వేదాంతార్థాలను మూలంగా చేసికొని కూర్చబడిన, **సుయుక్తిసాయక + ఆవలీః** = మంచి యుక్తులనే బాణాల వరుసలను, **సృజన్** = విడిచేవారై, **కువాదివిద్విషః** = దుర్వాదాలను చేసే బాహ్యమతస్థులనే శత్రువులను, **ప్రకాలయన్** = మిక్కిలిగా నశింపచేసేవారై, **గురోః పదే** = ఆచార్యుల



స్థానంలో, **అభిషిక్తః** = పట్టాభిషేకం చేయబడినవారై ఉండే, **ఏషః కూరరాట్** = ఈ కూరేశులు, **వైష్ణవీం శ్రియం** = శ్రీవైష్ణవుల సంపదను, **ప్రశాస్తి** = పరిపాలిస్తున్నారు.

ఇంతవరకు కూరేశులకు గల భగవద్రామానుజార్యవిషయకమైన భక్తి, మిగిలిన విషయాలలో విరక్తి, జ్ఞానం, శాంతి మొదలైన గుణాలు చంద్రసూర్యులవలె కాంతిని ప్రకాశింపజేసి చీకటిని పోగొట్టే శక్తి, సత్త్వగుణాన్ని కలవారిచే ఆశ్రయింపబడుతూ, వారికి మోక్షపురుషార్థాన్ని అనుగ్రహించే గొప్పతనం- మొదలైన విశేషాలను పురస్కరించుకొని ఈ శ్లోకంలో వారు ఆచార్యస్థానంలో పట్టాభిషేకం చేయబడి శ్రీవైష్ణవశ్రీని పరిపాలించే తీరునుగూర్చి అనుగ్రహించారు.

శ్రీవైష్ణవుల సంపద ఏది? అంటే - భగవద్రామానుజమునులు వేదాలను, ఉభయమీమాంసాన్యాయాలను, ఇతిహాసాలను, సాత్త్విక పురాణాలను సహాయంగా గ్రహించి, మధ్యస్థ భావనతో విచారించి, తమ శ్రీభాష్యాది గ్రంథాలలో నిక్షిప్తం చేసిన అర్థవిశేషాలు. వాటిని పరిపాలించడం అంటే - వాటికి విరుద్ధంగా మతాంతరులు పలికే అపార్థాలను ముందు ప్రస్తావించిన గ్రంథాలలో గల వేదాంతార్థాలను, వాటికి పొసగిన యుక్తులను పల్కి నిరాకరించడం, ఆ అర్థాలను తాము కూడ అనుభవించి, తమ శిష్యులకు ఉపదేశించడమే. వాటిలో మొదటిది రెండవ, మూడవ పాదాలలో, రెండవది మొదటి పాదంలోను తెలుపబడ్డాయి. **"యతీశవాగ్ఝరీసదానుభూతి"** అని భగవద్రామానుజుల శ్రీసూక్తులను వారు అనుభవించినట్లు చెప్పడం వారు తమ శిష్యులకు ఉపదేశించడాన్నికూడా ఉపలక్షణ విధిలో తెలుపుతున్నది.

15. **కథాహవోన్ముఖాన్ బహూన్ కపర్దిదుర్మతాశ్రయాన్**
**ముధాకృతాగమశ్రమాన్ విధాయ వాదినః పరాన్ ।**
**బుధాధరీకృతిక్షమైః స్వవాగ్ఝరీభరై రసౌ**
**బుధావలీసమీడితః చకాస్తి కూరభూపతిః ॥**

**అసౌ కూరభూపతిః** = ఈ కూరేశులు, **కథా+ఆహవ + ఉన్ముఖాన్** = వాదమనే యుద్ధం చేయడంకోసం తమకు ఎదురు నిలిచినవారు, **కపర్దిదుర్మత + ఆశ్రయాన్=** శివుని దుష్టమతాన్ని అనుసరించేవారు అయిన, **బహూన్ వాదినః** = పలు వాదాలను చేసేవారిని, **బుధ+అధరీకృతిక్షమైః** = బాహ్యమతస్థులను జయించడానికి తగిన, **స్వవాక్ఝరీభరైః** = తమ శ్రీసూక్తులనే, అధికమైన ప్రవాహాలతో, **ముధాకృత + ఆగమశ్రమాన్** = నిష్ఫలంగా చేయబడిన తమ శైవాగమాభ్యాసాన్ని కలవారినిగా,

**విధాయ** = చేసి, **బుధావలీసమీడితః** = మధ్యస్థులైన పండితుల సమూహంలో చాల స్తుతింపబడినవారై, **చకాస్తి** = ప్రకాశిస్తున్నారు.

గత శ్లోకంలో **"కువాదివిద్విషైః ప్రకాలయన్"** అని చెప్పబడ్డ బాహ్యమతాలను నిరసించే స్వభావాన్ని ఇందులో వివరిస్తున్నారు. శివుడే పరతత్త్వం అనే సిద్ధాంతాన్ని తెలిపే శైవాగమాన్ని ప్రమాణంగా కల్గిన కొందరు ఆళ్వాన్ ముందు వాదానికి సిద్ధం కాగా, వారిని జయించడంకోసం తగిన తమ వాక్కులతో వారిని జయించి, వారి శైవాగమాభ్యాసాన్ని నిర్వీర్యం చేసివేశారు కూరేశులు. అపుడు వారిని పండితగోష్ఠి స్తోత్రం చేసింది - అని శ్లోక తాత్పర్యం.

16 **విభూతి మైహికీం త్యజన్ విమోహదాయినీం భృశం**
**విధాతృముఖ్యసేవితా మహంతయాఽతిదూషితామ్।**
**శ్రుతీడితా మనిందితాం స్వరూపశేముషీమతాం**
**శ్రియం సమాశ్రయన్నసౌ విభాతి కూరభూపతిః॥**

**అసౌ కూరభూపతిః** = ఆ కూరేశులు, **విధాతృముఖ్యసేవితామ్** = బ్రహ్మ మొదలైనవారిచే సేవింపబడినది, (అందువల్ల), **అహంతయా అతిదూషితాం** = అహంకారంతో చాల ఎక్కువగా దూషితమైనది, (దానివల్ల), **భృశం విమోహదాయినీం**= లౌకికవిషయాలే అనుభవించదగినవి అనే అజ్ఞానాన్ని అధికంగా కల్గించగల్గినది అయిన, **ఐహికీం విభూతిం** = ఈ లోకాన్ని, **త్యజన్** = విడచివేస్తూ, **అనిందితామ్** = నిందింపబడనిది, **శ్రుతి+ఈడితామ్** = వేదాలచేత పొగడబడినది అయిన, **స్వరూప శేముషీమతాం** = జీవాత్మజ్ఞానాన్ని కల్గినవారియొక్క, **శ్రియం** = మోక్షం అనే సంపదను, **సమాశ్రయన్ విభాతి** = పొందుతూ ప్రకాశిస్తున్నాడు.

కూరేశులు లీలావిభూతిని విడచి, నిత్యవిభూతి అనే పరమపదాన్ని చేరి వెళ్ళడాన్నిగూర్చి స్తుతికర్త ఇందులో ప్రస్తావిస్తున్నారు. ఈ శ్లోకానికి ముందు శ్లోకం, దీనికి తరువాత కొన్ని శ్లోకాలు కూరేశులు చేసే పరపక్ష ప్రతిక్షేపాన్ని (ఇతర మతాలను గెలవడాన్ని) గూర్చి తెలుపుతూ ఉండగా, వారు ఈ లౌకిక జీవనాన్ని దాటి, వైకుంఠాన్ని పొందిన విషయాన్నిగూర్చి ప్రస్తావిస్తున్న ఈ శ్లోకం మధ్యలో ఏ విధంగా ప్రసక్తమైనది- అనే విషయం విజ్ఞులచేత విచారణీయం.

**"విభూతిః"**- భగవానునిచేత నియమింపబడి, శాసింపబడేది- అని అర్థం. ఇది నిత్యవిభూతి అని, లీలావిభూతి అని రెండు విధాలు. భగవానుడు తన వినోదం కోసం ఒక సమయంలో సృష్టించి, ఇంకొక సమయంలో లయం చేసే ఈ లోకం



లీలావిభూతి. భగవానుడు తాను, తన దేవేరులు, తన భక్తులైన నిత్యసూరులు, ముక్తులు కలసి అందమైన పేరోలగంలో ఉండి ఆనందించడంకోసం నిత్యంగా సంకల్పించిన పరమపదం నిత్యవిభూతి. ఈ లీలావిభూతిలో బ్రహ్మాదిదేవతలు, మానవులు నివసిస్తున్నారు. వీరందరు ఇంచుమించుగా, శరీరమే ఆత్మ అనే భావాన్ని, శరీరం కంటే వేఱుగా ఆత్మ అన్నది ఒకటి ఉన్నదని తలచినా, అది స్వతంత్రమే తప్ప పరమాత్మకు శేషభూతం కాదనే అహంకారాన్ని కలవారు. ఇటువంటి అహంకారాన్ని కలవారు నివసించడంచేత ఈ లీలావిభూతి యథార్థజ్ఞానాన్ని కల్గినది కాదు. విమోహదాయిని; అహంతాదూషితం.

ఇక, నిత్యవిభూతి అనబడే పరమపదం ఎటువంటిది? అని అంటే, ఇటువంటి అహంకారం ఏదీ లేకుండా, దీనికి విపరీతంగా, శరీరంకంటే ఆత్మ విలక్షణం అని, అది స్వతంత్రం కాదు, పరమాత్మాధీనం- అని భావించి, ఆ పారతంత్ర్యానికి అనుగుణంగా పరమాత్మకు సకలవిధకైంకర్యాలను చేసే నిత్యులు, ముక్తులు ఉండే చోటు. కనుక అది దూషితం కాదు కాబట్టి వేదంలో గొప్పగా కీర్తింపబడింది.

కొందరు భాగ్యవంతులైన మానవులు భగవత్కటాక్షం వల్లనో, ఆచార్యకటాక్షం వల్లనో అహంకారం తీరి, జీవాత్మ పరమాత్మకు శేషభూతం అనే జ్ఞానాన్ని పొంది, ఈ లౌకికవిధానాన్ని వీడి, పరమాత్మకు దాస్యం చేయడంకోసం పరమపదాన్ని చేరుతున్నారు. అటువంటివారిలో ఒకరైన కూరేశులు ఈ లోకాన్ని వీడి శ్రీవైకుంఠాన్ని చేరి, భగవత్కైంకర్యం అనే సంపదను పొంది, ప్రకాశిస్తున్నారు - అని శ్లోకతాత్పర్యం.

17. **మృషామతం విధాయ తన్మృషా స్వయుక్తిభి ర్జగ**
**న్మృషాత్వబాధకప్రమాప్రకాశికాభి రాత్మనామ్ ।**
**అనేకతా మశేషతాం ప్రకాశయన్ వ్యపోహయన్**
**ప్రమాతృశేఖరస్తుతః ప్రకాశతేఽత్ర కూరరాట్ ॥**

**కూరరాట్** = కూరేశులు, **జగత్+మృషాత్వబాధకప్రమాప్రకాశికాభిః** = లోకం అసత్యం అనే వాదాన్ని నిరాకరించే జ్ఞానాన్ని వ్యక్తం చేస్తున్న, **స్వయుక్తిభిః**= తమ యుక్తులతో, **తత్ మృషామతమ్** = లోకం అసత్యం అనే అద్వైతమతాన్ని, **మృషా విధాయ** = అసత్యంగా చేసి, (నిరాకరించి), **ఆత్మనామ్** = ఆత్మల, **అనేకతాం** = బహుత్వాన్ని, **ప్రకాశయన్** = వ్యక్తం చేస్తున్నవారై, **అశేషతాం** = ఆత్మలు భగవానునకు శేషభూతులు కారు అనేవాదాన్ని, **వ్యపోహయన్**=నిరాకరించేవారై, **ప్రమాతృశేఖరస్తుతః**=

యథార్థజ్ఞానాన్ని కలవారిలో, శ్రేష్ఠులచేత కీర్తింపబడేవార్తె, **అత్ర ప్రకాశతే** = ఈ లోకంలో ప్రకాశిస్తున్నారు.

కూరేశులు శైవమతాన్ని జయించిన విషయాన్ని పూర్వం పదిహేనవ శ్లోకంలో తెలిపి, ఇందులో అద్వైతమతాన్ని నిరాకరించడాన్నిగూర్చి ప్రస్తావిస్తున్నారు.

బ్రహ్మ ఒక్కటే సత్యం. అంతకంటే మిగిలినది ఏదీ లేదు. ఆత్మలు కాని, అచేతనమనబడే ప్రకృతి కాని లేవు. పరమాత్మ అయిన ఆ పరబ్రహ్మ అనాది అయిన మాయచే (అజ్ఞానంచే) ఆవరింపబడి తనకంటే వేఱయిన జీవాత్మలుగాను, అచేతన ద్రవ్యాలుగాను ప్రకాశిస్తున్నది. ఒక్కొక్క శరీరంలో ప్రవేశించి, సంసారియై, దుః ఖపడుతున్నది. ఆ బ్రహ్మమే ఆచార్యోపదేశంచేత (**తత్త్వమసి-త్వం** = నీవు, **తత్ అసి** = ఆ పరబ్రహ్మమే అయి ఉన్నావు. వేఱు కాదు అనే వేదవాక్యంయొక్క అర్థాన్ని ఆచార్యుని ఉపదేశంద్వారా) తనను జీవాత్మగా, మిగిలిన అచేతనద్రవ్యాలుగా భ్రమించిన భ్రమం తీరి మోక్షాన్ని పొందుతున్నది. పరమాత్మే జీవాత్మ. అందువల్ల జీవాత్మ పరమాత్మకు శేషం కాదు. జీవాత్మలు అనేకం లేవు. కనుక బ్రహ్మం ఒక్కటే సత్యం. జీవాత్మలు, జడమైన లోకం - అసత్యం - అన్నది అద్వైతుల వాదం.

పరబ్రహ్మ స్వచ్ఛమైన జ్ఞానాన్ని కల్గినది- అని వేదంలో చెప్పబడినందువల్ల తాను అయిన పరబ్రహ్మకంటే వేఱయిన జీవాత్మగా భ్రమించడం అనే దోషం దానికి ఏర్పడే అవకాశమే లేదు. **"త్వం తత్ అసి"** అనే వేదవాక్యం "మట్టినుండి పుట్టే ఘటశరావాదులు అన్నీ మట్టేసుమా!" అనే రీతిలో కార్యకారణాలకు గల సామానాధికరణ్యాన్ని తెలిపే ప్రకరణంలో ఉన్నందువల్ల పరబ్రహ్మవల్ల పుట్టే నీవు ఆ పరబ్రహ్మయే అవుతున్నావు అనే సామానాధికరణ్యాన్నే చెబుతున్నది. అంటే, సృష్టికి ముందు జీవాత్మకు శరీరం లేదు. కనుక జ్ఞానవికాసం లేక, భగవానునకు సూక్ష్మశరీరంగా ఉన్నాడు. సృష్టికి తర్వాత శరీరంతో కూడినవాడై, జ్ఞానవికాసాన్ని పొంది, భగవానునకు స్థూలశరీరంగా అవుతున్నాడు. అందువల్ల సృష్టికి ముందు ఉన్న సూక్ష్మమైన జీవాత్మను శరీరంగా కల్గిన పరమాత్మనుండి సృష్టిసమయంలో స్థూలమైన జీవాత్మను శరీరంగా కల్గిన పరమాత్మ జనిస్తున్నాడు - అని గ్రహింపబడడం వల్ల కారణమైన పరమాత్మ, కార్యం అయిన పరమాత్మ ఒక్కటే కదా! అందుచేత సృష్టికి ముందు, తరువాత పరమాత్మ, జీవాత్మలు, ఇంకా అచేతనమైన ప్రకృతి సత్యంగానే ఉన్నాయి. వేదంలో పరబ్రహ్మం, జీవుడు, జడం - అనే మూడు తత్త్వాలు వేర్వేరుగానే ఉన్నవి- అని పలు సందర్భాలలోను, జీవ- ప్రకృతులు పరబ్రహ్మకు శరీరభూతాలు అని పలుచోట్ల చెప్పబడడాన్ని గమనిస్తే, ఇవి మూడు సత్యాలు



అయిన తత్త్వాలే కనుక, వీటిలో ఏవీ అసత్యం అనేది లేదు- అన్నది నిశ్చయం. అంతేకాక, అసత్యమైన వస్తువు ఉన్నట్లు తోస్తే అది కొంచెంసేపయిన తర్వాత ఇది అసత్యం అనే జ్ఞానం కల్గడం సహజం. ఉదాహరణకు ఒకనికి ఒక ముత్యపు చిప్ప వెండిగా తోస్తే, కొన్ని నిమిషాల తర్వాత అది ముత్యపు చిప్పమాత్రమే, వెండి అని పూర్వం తోచినది అసత్యం అనే జ్ఞానం కలుగుతున్నది కదా! అదే రీతిలో ఎదురుగా ఉండే వాడు మానవుడని, ఎదురుగా ఉండేది ఘటం అని తోస్తే, తర్వాత ఎంత సేపు గడిచినా ఇతడు మానవుడు కాడు- అని కాని, ఇది ఘటం కాదు- అని కాని జ్ఞానం కలుగనందువల్ల, పరబ్రహ్మ కంటే వేఱయిన మిగిలిన జీవాత్మలు కాని, అచేతనాలు కాని అసత్యాలు కావు, సత్యమే- అన్నది విశిష్టాద్వైతమతం. ఇటువంటి యుక్తులను చూపి కూరేశులు జగత్తు అసత్తు అనే అద్వైతమతాన్ని అసత్తుగా చేశారు- అని తాత్పర్యం. ఈ విధంగా జీవాత్మలు అనేకం అని, వారు భగవానునకు శేషభూతు లని వేదంలో చెప్పబడినందువల్ల ఆ విధంగానే అంగీకరించి, ఆత్మలు పరమాత్మకు శేషభూతులు కారు అనే వాదాన్ని నిరాకరించి, **"నిత్యో నిత్యానామ్"** అనే వాటి బహుత్వాన్ని కూరేశులు వ్యక్తం చేశారు - అని గ్రహించాలి.

**18. శ్రుతిం దృఢప్రమాణయన్ జగద్విధాతరీశ్వరే**
**పరోక్త మానుమానికేశ్వరత్వ మప్యధోనయన్ ।**
**అణో ర్జగన్నిదానతా మపోహయన్ విరాజతే**
**స్వసూక్తిభిః స్వయుక్తిభిః సుధీవరోఽత్ర కూరరాట్ ॥**

**సుధీవరః**=బుద్ధిమంతులలో గొప్పవారైన, **కూరరాట్**= కూరేశులు, జగద్విధాతరి= లోకాన్ని సృష్టించిన, **ఈశ్వరే** = ఈశ్వరుడైన శ్రీమన్నారాయణుని విషయంలో, **శ్రుతిం** = వేదాన్ని, **దృఢప్రమాణయన్** = అవిచాల్యం అయిన - అంటే - చలించని ప్రమాణంగా ఒప్పుకొని, **పరోక్తం** = వైశేషికులచేత చెప్పబడ్డ, **ఆనుమానిక + ఈశ్వరత్వం**= సృష్టికర్త అయిన ఈశ్వరుడు అనుమానప్రమాణంతో సిద్ధిస్తున్నాడు- అనే విషయాన్ని, **అధోనయన్** = కిందకు గెంటివేసేవార్తె, **అణోః** = పరమాణువు యొక్క, **జగన్నిదాన మపి** = లోకాన్నిగూర్చి మొదటి కారణంగా ఉండడాన్నిగూర్చి, **స్వసూక్తిభిః** = తమ వచనాలతోను, **స్వయుక్తిభిః** = తమ యుక్తులతోను, **అపోహయన్**= నిరాకరించేవార్తె, **విరాజతే** = గొప్పగా ప్రకాశిస్తున్నారు.

కూరేశులు వైశేషికుల వాదాన్ని తిరస్కరించిన తీరునుగూర్చి ఇందులో తెలుపుతున్నారు.

కణాదుడనే ముని ప్రవర్తింపజేసిన మతాన్ని అనుసరించేవారు వైశేషికులు. వారు, జగత్తును సృష్టించినవాడు, నిమిత్త కారణమైనవాడు శివుడు. అతడు అనుమాన ప్రమాణంద్వారా తెలియబడుతున్నాడు. జగత్తుకు మొదటి కారణం పరమాణువులు. వాటినికూడ అనుమానప్రమాణంతోనే తెలిసికోవాలి- అని అంటారు. వారి వాదం ఏమంటే - ఘటపటాదిపదార్థాలను, వాటికి మొదటి కారణాలైన మన్ను, తంతువులను తెలిసికొని, వాటిని తన సామర్థ్యంతో ఉపయోగించి, సృష్టించే కుమ్మరి, సాలెవాడు మొదలైనవారిని లోకంలో చూస్తున్నాము కద! అదే రీతిలో, మిక్కిలి పెద్దవి అయిన భూమి, పర్వతం, సముద్రం మొదలైన పదార్థాలను, వాటి ప్రథమ కారణం అయిన పరమాణువులను కంటితో చూచి, వాటిని తన గొప్పశక్తితో ఉపయోగించి సృష్టించేవాడు ఒకడున్నాడని ఒప్పుకొనవలసి ఉన్నది కద! అటువంటి గొప్ప జ్ఞానం, గొప్ప శక్తి మనకు లేనందువల్ల మనకంటే గొప్పవాడొకడు అవశ్యం ఉండే తీరాలి- అని ఈ రీతిలోని అనుమానంద్వారా ఈశ్వరుని సత్తను వారు సాధిస్తారు. లోకానికి ప్రథమ కారణం పరమాణువులు. పరమాణువు అంటే-చాలా చిన్న అణువు. మన ఇంటిలో కిటికీ ద్వారా లోపలకు పడే ఎండలో ఎగిరే సూక్ష్మమైన కణంయొక్క ఆఱు భాగాలలోని ఒక భాగం పరమాణువు. అటువంటి పరమాణువులు రెండు కలిస్తే ద్వ్యణుకం పుడుతుంది. అవి మూడు కలిస్తే త్ర్యణుకం పుడుతుంది. అదే ఎండలో మన కంటికి కన్పించే అత్యంతసూక్ష్మమైన పదార్థం. ఘటం కళ్ళకు కన్పిస్తుంది. అది తన అవయవాలైన రెండు కపాలాలతో (రెండు సగభాగాలతో) పుడుతున్నది అని చూస్తున్నాము కదా! అదే రీతిలో కంటికి కన్పించే త్ర్యణుకంకూడా తన అవయవాల కలయికతో పుడుతున్నదని అంగీకరించాలి. ఆ అవయవాలకు ద్వ్యణుకాలని పేరు (అవి కంటికి కానరావు). కంటికి కన్పించే ఘటాన్ని పుట్టించే కపాలం, తన అవయవాలైన కాపాలికాలు అనబడే అవయవాలతో పుడుతున్నది కదా! అదే రీతిలో కంటికి కన్పించే త్ర్యణుకాన్ని పుట్టించే ద్వ్యణుకం కూడ తన అవయవాలతో పుడుతున్నది- అని అంగీకరించాలి. ఆ అవయవాలకే పరమాణువులని పేరు. అవి కూడా కంటికి కన్పించవు. ఇటువంటి పరమాణువులే లోకానికి ప్రథమ కారణం-అని అంటారు. వైశేషికులు.

ఈ రెండు వాదాలు సరి కావు అని వేదాన్ని అవిచాల్య ప్రమాణంగా గ్రహించి కూరేశులు ఇందులో నిరాకరిస్తున్నారు. (1) ఇంతటి గొప్ప భూమి, పర్వతాలు, సముద్రాలు- అనే వీటిని ఒకడు సృష్టించాలంటే అతడు దానికి తగిన గొప్ప జ్ఞానాన్ని, శక్తిని కలవాడై ఉండాలి. ఘటపటాది పదార్థాలనుబట్టి ఈశ్వరుని నిమిత్తకారణంగా



సాధించడానికి వీలు లేదు. ఎందుకంటే, ఆ పదార్థాలను సృష్టించే కుమ్మరి, సాలెవాడు వలె పరిమిత జ్ఞానశక్తులను కలవాడుగానే ఆ ఈశ్వరుడు సిద్ధిస్తాడు. అంతు లేని జ్ఞానాన్ని, శక్తిని కలవాడుగా ఏనాడూ సిద్ధించడు. అందువల్ల, అనుమానంతో ఈశ్వరుణ్ణి సాధించడానికి సాధ్యం కాదు. (2) పరమాణువును శ్రమపడి ముందు తెలిపిన అనుమానంతో సాధించినా ప్రయోజనం లేదు. అది లోకానికి మొదటి కారణం కాలేదు. రెండు కపాలాలలో ఒకటి తన ఆఱు భాగాలతో (నాల్గు దిక్కులు, ఊర్ధ్వ అధో దిశలు అనే ఆఱింటితో) వేఱొకదానితో చేరి, ఘటాన్ని పుట్టిస్తున్నది. అదే రీతిలో ఒక పరమాణువు వేఱొక పరమాణువుతో ఈ ఆఱు భాగాలతో కలసి తనకంటే గొప్పదైన ద్వ్యణుకాన్ని సృష్టించాలి. మిక్కిలి సూక్ష్మం అయిన పరమాణువుకు ఈ ఆఱు భాగాలు లేనందువల్ల, ఒకటి ఇంకొక దానితో చేరలేదు. కనుక ద్వ్యణుకం పుట్టే అవకాశమే లేదు. అందుచేత, పరమాణువునకుకూడ జగత్తునుగూర్చి మొదటి కారణంగా అయే స్వభావాన్ని చెప్పడానికి సాధ్యం కాదు.

అయితే, లోకానికి మొదటి కారణం ఏది? కర్త ఎవరు? అంటే రెండు కారణాలూ ఒక్క పరబ్రహ్మమే. ఈ విషయం పలు ఉపనిషత్తులలో చెప్పబడినా, ఇక్కడ ఛాందోగ్యోపనిషత్తులోని ఈ క్రిందివాక్యం ఉదాహరణంగా వివరింపబడుతున్నది.

**"సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్"** అన్నది ఆ ఉపనిషత్తులోని ఒక వాక్యం. ఉద్దాలకమహర్షి తన కుమారుడైన శ్వేతకేతువును ఉద్దేశించి పల్కిన మాట ఇది. **"సౌమ్య! ఇదమ్ అగ్రే సదేవ, ఏక మేవ, అద్వితీయమ్ ఆసీత్"** అని అన్వయం. చంద్రునివలె ఆహ్లాదాన్ని కల్గించేవాడా! దేవ మనుష్య తిర్యక్ స్థావరాది వివిధనామాలతో పలు రూపాలతో మారిన ఈ లోకం - దీనికి ముందు ప్రళయ కాలంలో- సత్ అనే ఒక పేరుతో ఒకే రూపంతో, ఒకటిగానే ఉన్నది. అది ఇపుడు పలు పేర్లతోను, పలు రూపాలతోను కనబడుతున్నది. ఇది ఈ వాక్యానికి అర్థం. కుమ్మరివాని ఇంటిలో ఇపుడు ఈనాడు మనకంటి ముందే కన్పించే, వేఱ్వేరు అయిన పలు రూపాలతోను, వాటికి తగిన ప్రమిద, మూకుడు, చట్టి, బాన, కూజా - మొదలైన పలు రూపాలతో కూడి ఉండే పలు వస్తువుల సమూహం. నిన్న ఒకే విధమైన రూపంతో, మన్ను అనే ఒకే పేరుతో, ఒకే ద్రవ్యంగా ఉన్నది. అంటే, ఇపుడు ఈనాడు పలు విధాలుగా కన్పించే ఈ వస్తువులకు అన్నిటికీ నిన్న ఉన్న మన్ను అనే ఒకే వస్తువే మొదటి కారణం - అన్నదే కదా స్పష్టపడిన సత్యం. అదే రీతిలో, ఇపుడు దేవమనుష్య జంతు స్థావరాది పలు నామాలతో, పలు రూపాలతోను

కనిపించే వస్తువులకు మొదటి కారణం- **"సత్"** అనే ఒకే పేరుతోను, దానికి తగిన ఒకే రూపంతోను కూడి ఒక్కటిగా ఉండే పరబ్రహ్మమే అని కదా చెప్పాలి. అందువల్ల బ్రహ్మమే లోకానికి ప్రథమ కారణం అనేది స్పష్టమైనది.

అంతే కాక, ఇపుడు కన్పించే బాన, చట్టి, మొదలైనవి అన్నీ మన్నురూపంలోనే నిన్న ఉన్నవి అంటే, వాటిని చేసే కర్తగా కుమ్మరివాడు ఉన్నట్లే కదా!

అదే రీతిలో, ప్రకృతంలో దేవమనుష్యాది జగత్తు అంతా పూర్వం బ్రహ్మమనే ఒకే వస్తువుగా ఉన్నది అంటే, ఈ లోకాన్ని సృష్టించే కర్త ఒకడు ఉండి తీరాలి అనే ప్రశ్న కలుగుతుంది. కదా! దానికి సమాధానమే పూర్వం ప్రస్తావింపబడ్డ వేదవాక్యంలోని **"అద్వితీయమ్"** అనే పదం. అది "సత్" అని పరబ్రహ్మను తెలిపేదానికి విశేషణం. పరబ్రహ్మం అద్వితీయం అంటే, జగత్తుకు మూలకారణం అయిన పరబ్రహ్మం తన కంటే వేఱయిన కర్త అనే రెండవ వస్తువును కల్గినది కాదు- అనే అర్థం కనుక లోకానికి కర్త కూడ పరబ్రహ్మమే- అని సిద్ధిస్తున్నది.

**"సత్"** శబ్దవాచ్యమైన బ్రహ్మం శ్రీమన్నారాయణుడే. **"సదేవ సౌమ్య"** అనే వాక్యంవలె **"ఏకోహ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా నేశానః"** అనే మహోపనిషద్వాక్యం కూడ కారణవాక్యమే కనుక **"సత్"** అనే పదం ప్రకృతిలో నారాయణునే చెబుతున్నది అని సర్వశాఖాప్రత్యయన్యాయాన్నిబట్టి చెప్పడమే ఉచితం.

అందువల్ల ఇటువంటి శ్రుతివాక్యాలను దృఢమైన ప్రమాణాలుగా గొని, దీనికి తగిన యుక్తులను గ్రహించి కూరేశులు లోకానికి మొదటి కారణం పరమాణువులు కాదు; దానికి కర్త (నిమిత్తకారణం) శివుడు కాదు; నారాయణుడే లోకానికి మూల (ఉపాదాన) కారణం, నిమిత్తకారణం అవుతున్నాడు అని స్థాపించారు - అని స్తుతికర్త ఈ శ్లోకంలో తెలియజేశారు. ఈ సందర్భంలో వివరించదగిన అంశాలు చాలా ఉన్నా విస్తరభీతిచేత ప్రస్తావించడంలేదు.

19. **శివాత్ పరం న హీతి వై లిఖేతి చోళభూపతేః**
**వచః శ్రుతే రనంతరం తదుత్తరం వచో లిఖన్।**
**అపాహస న్మహీసురై ర్య ఈడితో మహీపతిం**
**విభాతి కూరరాడ్గురు స్స సర్వశాస్త్రపారగః ॥**

**సర్వశాస్త్రపారగః =** అన్ని శాస్త్రాలలోను పారంగతులైన (చక్కని పూర్ణమైన జ్ఞానాన్ని కల), **యః=** ఎవరు (ఏ కూరేశులు), **శివాత్ పరం=** శివునికంటె వేఱొక పరతత్త్వం, **న హి ఇతి వై =** లేనే లేదు అనే, **లిఖ ఇతి=** మీరు వ్రాయండి అనే, **చోళభూపతేః వచః =** చోళరాజు పల్కిన మాటను, **శ్రుతేః అనంతరం=** వినినంతనే, **తదుత్తరం వచః=** (దానిని వ్రాయకుండా), దానికి ప్రత్యుత్తరం అయిన మాటనే, **లిఖన్=** వ్రాసేవారై, **మహీపతిం =** ఆ చోళరాజును, **అపాహసన్ =** పరిహాసం చేసేవారైనారో, సః **కూరరాట్ గురుః =** ఆ కూరేశులనే ఆచార్యులు, **మహీసురైః =** శ్రీవైష్ణవులచేత, **ఈడితః విభాతి =** స్తుతింపబడినవారై ప్రకాశిస్తున్నారు.

భగవద్రామానుజుల కాలంలో చోళరాజ్యాన్ని పాలించే ప్రభువు ఒకడు వీరశైవుడు అయినందువల్ల శైవమతాన్నే పరమప్రమాణంగా భావించి, **"శివాత్ పరతరం నాస్తి"** (శివుడే పరతత్త్వం, ఆ దైవంకంటె పరతత్త్వం ఇంకొకటి లేదు) అని తాళపత్రంలో వ్రాసి, సంతకం చేయాలి- అని పలువురు పండితులను నిర్బంధించి, భయపెట్టి, ధనాన్ని భూమిని ఇచ్చి ప్రలోభపెట్టి, వారిచేత సంతకం పెట్టించి, పరతత్త్వ నిర్ణయాన్ని చేయాలి అని గర్వించి ప్రవర్తించాడు. అతని దగ్గర పనిచేసే నాలూరాన్ అనేవాడు **"భగవద్రామానుజులు సంతకం పెట్టినపుడుకదా ఈ మాటకు విలువ ఉన్నది"** అని పల్కగా, ఆ రాజు వెంటనే శ్రీరామానుజులను తీసికొని రమ్మని తన భటులను ఆజ్ఞాపించాడు. వారు శ్రీరంగం చేరి, శ్రీరామానుజుల మఠం వాకిలికి వచ్చి, **"భగవద్రామానుజులు ఎక్కడ ఉన్నారు?"** అని అడిగారు. అపుడు సంగతిని గుర్తించిన కూరేశులు భగవద్రామానుజులకు కలుగబోయే అపాయాన్ని గమనించి, వారి తిరుమేనికి రక్షణ కల్గించాలని తలచారు. ఆ సమయంలో శ్రీరామానుజులు స్నానమాడడంకోసం కావేరీ నదికి వెళ్ళారు. కూరేశులు శ్రీరామానుజుల త్రిదండం, కాషాయాలు మొదలైనవానిని తాము ధరించి, శ్రీరామానుజులకు చెప్పకుండానే, తామే భగవద్రామానుజులుగా చోళరాజు సభలో ప్రవేశించారు. చోళుడు తన అలవాటు ప్రకారం **"శివాత్ పరతరం నాస్తి"** అని వ్రాసి ఆ వాక్యంకింద సంతకం పెట్టమని కూరేశులతో అన్నాడు. అపుడు కూరేశులు ఆ విధంగా చేయకుండా **"ద్రోణ మస్తి తతః పరమ్"** అని అవహేళన చేస్తూ వ్రాశారు- అనే ఈ వృత్తాంతం ప్రస్తుతశ్లోకంలో ప్రస్తావించబడింది.

ఉపనిషత్తులనే ప్రమాణంగా గ్రహించినపుడు భగవద్రామానుజుల శిష్యులు కూరేశులు కనుక **"ఏకోహ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా నేశానః"** (జగత్సృష్టికి పూర్వం నారాయణుడు ఒక్కడే కద ఉన్నాడు. బ్రహ్మకాని, ఈశ్వరుడు కాని లేరు) అని మహోపనిషత్తులలోని వాక్యాన్ని తెలిసినవారు. కనుక శివుడే పరతత్త్వం అని ఒప్పుకోవడానికి అంగీకరించక, రాజదండనకుసైతం భయపడకహేళనగా **"ద్రోణ మస్తి తతః పరమ్"** అని తాళపత్రంపై వ్రాశారు. శివశబ్దం ఎనిమిది సోలలు (అడ్డెడు - కుంచంలో సగం) పరిమాణాన్ని కల కొలతకుకూడ పేరు. కనుక, చోళుని వాక్యానికి

**"అడ్డెడు"** (సగం కుంచం) అనే కొలతకంటె పెద్దది లేదు- అనే అర్థాన్ని చెప్పే అవకాశం ఉన్నది కనుక, వేళాకోళంగా ఆ అర్థాన్ని గ్రహించి కూరేశులు, ఆ అర్థం అసమంజసం అనే అర్థం వచ్చేటట్లుగా **"ద్రోణ మస్తి తతః పరమ్"** (శివశబ్దంతో వ్యవహరింపబడే ఎనిమిది సోలలు పరమాణాన్ని కల అడ్డ అనే కొలతకంటే పదహారు సోలల పరిమితిని కల కుంచం అనే కొలత ఉన్నది) అని వ్రాశారు. ఇందువల్ల కోపాన్ని పొందిన ఆ చోళుడు కూరేశులతో పాటు వచ్చిన పెరియనమ్బి (మహాపూర్ణులు) అనే ఆచార్యుల కన్నులను, కూరేశుల నేత్రాలు పెకిలించి వేయవలసినదిగా క్రోధంతో ఆజ్ఞాపించాడు. రాజాజ్ఞ ప్రకారం పెరియనంబి నేత్రాలు పెరికి వేయబడ్డాయి. కూరేశులు ఇంతటి దుష్టుడైన చోళుని చూచిన కళ్ళతో తిరిగి శ్రీరామానుజులను సేవించలేను అని అంటూ తమ కళ్ళను తామే తీసివేసి కొన్నారు. భగవద్రామానుజదర్శనాన్ని కాపాడడం కోసం తమ దర్శనాలను త్యాగం చేసిన మహనీయులు వీరు. (దర్శనం అంటే సిద్ధాంతం అని, నేత్రం అని అర్థం) ఈ విధంగా చోళుని హేళనం చేసిన కూరేశులను విద్వాంసులందరూ కీర్తిస్తున్నారు- అని ప్రకృత శ్లోకంలోని సారం.

**20. యతీశ్వరగ్రహగతాన్ భటాన్ విలోక్యభూపతేః**
**స్వయం త్రిదండితాం భజన్ తదీయరక్షణేచ్ఛయా ।**
**శిలీముఖాల్పకీటయోః నయం సదార్యశిష్యయోః**
**ప్రదర్శయన్ స్వచర్యయా చకాస్తి కూరభూపతిః ॥**

**కూరభూపతిః**= కూరానికి ప్రభువైన కూరేశులు, **యతీశ్వరగ్రహ + ఆగతాన్ =** యతిరాజులైన భగవద్రామానుజులను పట్టుకొని పోవడంకోసం వచ్చిన, **భూపతేః భటాన్ =** ప్రభువు భటులను, **విలోక్య =** చూచి, **తదీయరక్షణ + ఇచ్ఛయా =** వారి (రామానుజుల) రక్షణలో తాము పొందిన ఆశతో, **స్వయం =** స్వయంగా, **త్రిదండితామ్ =** త్రిదండాన్ని, **భజన్ =** గ్రహించినవారై, **స్వచర్యయా =** ఇటువంటి తమ నడతతో, **శిలీముఖ + అల్పకీటయోః =** శిలీముఖానికి, అల్పకీటకానికి మధ్యగల న్యాయాన్ని, **సదార్య శిష్యయోః** = మంచి ఆచార్యునకు, మంచి శిష్యునకు ఉండే, **న్యాయం =** న్యాయాన్ని, **ప్రదర్శయన్ =** ప్రదర్శిస్తూ, **చకాస్తి =** ప్రకాశిస్తున్నారు.

పూర్వశ్లోకంలో ప్రస్తావింపబడ్డ కథలో కూరేశులు భగద్రామానుజుల త్రిదండ కాషాయాలను ధరించి, రాజసభకు వెళ్ళడాన్నిగూర్చి తెలుపబడింది కద! అందులో భ్రమరకీటన్యాయాన్ని స్తుతికర్త సమన్వయింప జేస్తున్నారు. శిలీముఖం అంటే భ్రమరం- తుమ్మెద. కీటః-పురుగు. అల్పకీటః - చిన్న పురుగు. భ్రమరకీటన్యాయం అంటే - ఒక భ్రమరం చిన్న పురుగును తీసికొనివచ్చి తన గూటిలో పెట్టి, దాని చుట్టూ ఎప్పుడూ ధ్వనిస్తూ తిరుగుతూ ఉంటే, గూటిలోని పురుగు భ్రమరం రూపాన్ని, స్వభావాన్ని నిత్యం తలుస్తూ ఆ తుమ్మెదగానే మారుతుంది- అనే న్యాయమే. భగవద్రామానుజులచే అభివృద్ధిని పొందింపబడ్డ కూరేశులు భగవద్రామానుజులను ధ్యానించి, ధ్యానించి, చివరకు వారివలెనే త్రిదండకాషాయాలను ధరించి, భగవద్రామానుజులుగానే మారిపోయారు. భ్రమరకీటన్యాయం ఆచార్యశిష్యులమధ్య ఉన్నదని లోకానికి చాటి చెప్పారు- అని తాత్పర్యం.



**"సదార్యశిష్యయోః"** అనే ప్రయోగంలోని **"సత్"** అనే శబ్దం రెండుచోట్ల అన్వయించడం ద్వారా **"సదార్య - సచ్ఛిష్యయోః"** అనే అర్థాన్ని ఇస్తుంది. సద్గురువు, సచ్ఛిష్యుడు అని భావం - **యతీశ్వరాశ్రమాగతాన్-** భగవద్రామానుజుల ఆశ్రమానికి వచ్చిన భటులను అన్నది పాఠాంతరం. అంతకంటే, **యతీశ్వరగ్రహాగతాన్** - అనే పాఠమే సరసతరం.

**21. నిరాకర్తుం మోహం నిఖిలజనచిత్తాశ్రయ మసౌ**
**దయాసింధుః సాంద్రాత్ నిరవధికవిజ్ఞానవిభవాత్ ।**
**మహీభాగే మాసే మకరమహితాఖ్యే సమజని**
**ప్రశస్తే హస్తర్క్షే శుభగుణనిధిః కూరనృపతిః ॥**

**శుభగుణనిధిః** = సద్గుణాలకు నిధి అయిన, **అసౌ కూరనృపతిః =** ఈ కూరేశులు, **దయాసింధుః సన్ =** ఆ గుణాలలో ముఖ్యమైన దయకు సముద్రుడై, **సాంద్రాత్ =** అధికమైన, **నిరవధిక**=అంతు లేని, **విజ్ఞానవిభవాత్ =** (తమ) జ్ఞానంయొక్క గొప్పతనంచేత, **నిఖిలజనచిత్తాశ్రయం =** అందఱు జనుల మనస్సును ఆశ్రయించి ఉండే, **మోహం నిరాకర్తుం =** అజ్ఞానాన్ని తొలగించడంకోసం, **మహీభాగే =** ఈ భూ ప్రదేశంలో, **మకరమహితాఖ్యే =** మకరం అని పిలువబడే, గొప్ప పేరును కల, **మాసే =** మాసంలో, **ప్రశస్తే =** కీర్తించబడిన, **హస్తర్క్షే =** హస్త అనే నక్షత్రంలో, **సమజని =** అవతరించారు.

పూర్వం తెల్పిన రీతిలోనే భగవద్రామానుజుల కటాక్షంతో సకలశాస్త్రాలలోను, ముఖ్యంగా వేదాంతశాస్త్రంలో విశేషమైన పాండిత్యాన్ని సంపాదించి, శిష్యులకు ఉపదేశించి, తాము తమ శిష్యులు కలిసి సత్కాలక్షేపం చేస్తూ, తమ సిద్ధాంతానికి బాహ్యులైన శైవ వైశేషిక- అద్వైతాదిమతాలను జయించిన కూరేశులు అవతరించిన మాసనక్షత్రాలను ఇందులో స్తుతికర్త స్తుతిస్తున్నారు.

కూరత్తాழ்వాన్ సకలకల్యాణగుణపూర్ణులు. విశేషించి, దయాగుణానికి సముద్రంవంటివారు. లేక, సముద్రంవలె అంతు లేని దయను కలవారు. వారు

ఆ దయతో ఏమి చేశారు? అని అంటే, లోకుల మనస్సులో చలించకుండా ఉండే అజ్ఞానాన్ని పోగొట్టడంకోసమే లోకంలో అవతరించారు - అని స్తుతికర్త అంటున్నారు. వారు అవతరించిన మాసం మకర (తై)మాసం, నక్షత్రం హస్త **"మం-మంగళం, కరోతి ఉత్పాదయతి ఇతి మకరః", "మకమ్ అలంకారమ్ రాతి దదాతి ఇతి మకరః"-** అని మకరశబ్దానికి రెండు వ్యుత్పత్తులను చెప్పవచ్చు. మనలను జన్మింపజేసే మాసం అని, మాసాలు అన్నిటికీ అలంకారాన్ని, అంటే - శోభను కలుగ జేసేది అని ఈ రెండు వ్యుత్పత్తులలోని భావాలు. హస్త నక్షత్రానికి అధిదేవత సూర్యుడు. ఇటువంటి మాసంలో అవతరించడంవల్ల కూరేశులు లోకానికి మంచిని కల్గిస్తున్నారు. భగవద్రామానుజుల శిష్యకోటికి అలంకారాన్ని - శోభను - కల్గిస్తున్నారు. అని, హస్త నక్షత్రంలో అవతరించినవారు కనుక సూర్యునివలె ఆంతర తమస్సు అయిన అంధకారాన్ని పోగొడుతున్నారు- అని చెప్పవచ్చు. అంతేకాక, మకరమాసంలో అవతరించిన తిరుమழிశై ఆழ்వార్లవలె ఇతరమతస్థులను ఓడించి, పరతత్త్వ నిర్ణయాన్ని చేసినవారని, హస్తలో అవతరించిన కంచి వరదరాజస్వామి భగవద్రామా నుజులకు ఆఱు వార్తలను అనుగ్రహించి, ఉపకారం చేసినట్లే, కూరేశులుకూడ వృత్తిగ్రంథాన్ని జ్ఞాపకం పెట్టుకొని, దానిని ఆ రామానుజులకు విన్నపించి ఉపకారం చేసినవారని అనడంలో సారస్యం ఉన్నది. హస్తలో అవతరించిన వరదరాజస్వామి **"పేరరుళాళన్" ("మహాదయాపాలకః")** అని అనబడుతున్నాడు. అటువంటి రీతిలోనే హస్తలో అవతరించిన కూరేశులు ఈ శ్లోకంలో **"దయాసింధుః"** అని నిర్దేశింపబడి **"పేరరుళాళన్"** అయినారు కదా! **"దయాసింధుః"** - దయకు సముద్రంవంటివాడు. అంటే - పేరరుళాళనే కదా!

22. **అనాధృష్యాం బ్రహ్మాదిభి రపి సురై రాత్మకృతిభిః**
**సదాఽప్యేకాకారామ్ అనధిగతవృద్ధిక్షయకథామ్ ।**
**అహంతా మజ్ఞానాం ప్రకృతి మనురూపాం మమ కృతేః**
**పురా కుర్వన్ కూరప్రభు రఖిలన్నృణాం విజయతే ॥**

**కూరప్రభుః =** కూరేశులు, **బ్రహ్మాదిభిః =** బ్రహ్మదేవుడు మొదలైన, **సురైః అపి =** దేవతలచేకూడ, **అనాధృష్యాం =** పోగొట్టడానికి సాధ్యం కానిది, **అనధిగత వృద్ధిక్షయకథామ్ =** వృద్ధి చెందడం, క్షీణించడం- అనే మాటలనుకూడ తెలియనిది, **సదా అపి =** ఎల్లప్పుడు, **ఏక + ఆకారామ్ =** పూర్ణమైన వృద్ధితో ఒకే విధమైన రూపాన్ని కల్గినది, **మమ కృతేః =** మమకారానికి, **అనురూపాం ప్రకృతిం=**తగిన మూల కారణమైనది అయిన, **అజ్ఞానాం =** జ్ఞానహీనులైన, **అఖిలన్నృణాం =** సమస్త



జనుల యొక్క, **అహంతామ్ =** అహంకారాన్ని, **పరాకుర్వన్ సన్ =** నిరాకరించేవారై, **విజయతే=** సర్వోత్కర్షతో వెలుగుతున్నారు.

పూర్వం, అందఱి అజ్ఞానాన్ని పోగొట్టడంకోసమే కూరేశులు అవతరించారని చెప్పబడింది. ఇపుడు వారు ఆ అజ్ఞానంవల్ల కలిగే అహంకారాన్ని తీర్చే తీరు చెప్పబడుతున్నది.

నేను స్వతంత్రుణ్ణి అని భావించడం అహంకారం. నేను తప్ప మిగిలినవి అన్నీ నావే - అని భావించడం మమకారం. ఇవి రెండూ తన స్వరూపాన్ని, మిగిలిన వాని స్వరూపాన్ని తెలియనివారికి కలుగుతాయి. తనను తెలిసికోవడం అంటే - తాను స్వతంత్రుడు కాదు, భగవానునకే శేషభూతుడు- అని తెలియడం. మిగిలిన వస్తువులను తెలియడం అంటే- ఇవికూడ తనవలె భగవానునకే చెందినవి- అని గ్రహించడం. అహంకారం మమకారానికి మూలకారణం. నేను స్వతంత్రుణ్ణిగా ఉండదగిన వాడను అనే అహంకారం ఉంటే లోకంలోని వస్తువులు అన్నీ నా అనుభవం కోసమే ఉన్నాయి; కనుక అవి నావే" అనే మమకారం కలుగుతుంది కద!

అందువల్ల కూరేశులు అజ్ఞులైన జనులకు "మీరు శ్రియఃపతికే చెందిన శేషభూతులు సుమా! స్వతంత్రులు కానే కారు" అని ఉపదేశించి, "నేను స్వతంత్రుణ్ణి" అనే వారి అహంకారాన్ని పోగొడుతున్నారు. అహంకారం పోగానే దాన్ని మూల కారణంగా కల "ఇవి అన్నీ నావే" అనే మమకారం కూడ నశిస్తుంది అన్నది స్పష్టం.

ఇటువంటి అహంకార- మమకారాలు చాల గొప్పవారుగా ప్రసిద్ధి చెందిన బ్రహ్మాదిదేవతలచేతకూడ పోగొట్టడానికి సాధ్యం కానివి. ఎందువల్ల? అని అంటే, అవి వారికికూడ కలుగుతాయి కనుక. అందువల్లనేకద **"విధాతృముఖ్యాసేవితా మహంతయాఽతిదూషితామ్ విభూతి మైహికీమ్"** అని 16వ శ్లోకంలో చెప్పబడింది. బ్రహ్మాదిదేవతలు అహంకార మమకారాలను కలవారు కనుక, వారు నివసించే ఈ విభూతి, ఈ విభూతిలో ఉండే జనులు వాటిచేత దూషితులు. కనుక కూరేశులు దీనిని విడచి పరమపదాన్ని చేరుకున్నారని చెప్పబడింది. ఇవి వృద్ధిక్షయాలనే వాటిని ఏ మాత్రం లేనివై, చక్కగా ఎప్పుడూ వృద్ధి చెంది, ఆ వృద్ధియొక్క ఎల్ల అయిన ఒకే స్థితిలో ఉండడంవల్ల **"సదాఽపి ఏకాకారామ్"** అని అనబడింది. ఇటువంటి వీటిని- అహంకార- మమకారాలను - కూరేశులు స్వరూపజ్ఞానాన్ని కల్గించడంద్వారా పోగొట్టి, శత్రువులను జయించి వెలిగే ప్రభువువలె ప్రకాశిస్తున్నారు - అని తాత్పర్యం.

23. **అమోఘై రుత్కూలై రనుపధి సముత్థై రనుపమైః**
**కటాక్షైః ప్రేమార్ద్రైః కలిమల మశేషం వ్యపనయన్ ।**
**జనానా మానందం నిరవధిక మద్యాపి జనయన్**
**జయత్యేష శ్రీమాన్ మమ కులగురుః కూరనృపతిః ॥**

**మమ కులగురుః=** దాసునకు కులగురువు, **శ్రీమాన్=** శ్రీవైష్ణవశ్రీని కలవారు అయిన, ఏషః **కూరనృపతిః** = ఈ కూరేశులు, **అమోఘైః** = నిష్ఫలం కానివి, **అనుపమైః** = సాటి లేనివి, **ప్రేమ+ఆర్ద్రైః** = ప్రేమతో చల్లనివి, **అనుపధిసముత్థైః=** నిర్హేతుకంగా పుట్టినవి, **ఉత్కూలైః=** తీరాన్ని అతిక్రమించినవి అయిన, **కటాక్షైః=** తమ కడగంటి చూపులతో, **కలిమలం=** కలివల్ల కలిగే దోషాన్ని, **అశేషం=** అంతటినీ, **వ్యపనయన్=** పోగొట్టేవారై (దానివల్ల), **జనానాం=** జనులకు, **నిరవధిమ్ ఆనందం=** అంతులేని ఆనందాన్ని, **అద్య+అపి=** ఈనాడు కూడ, **జనయన్=** కల్గించేవారై, **జయతి=** సర్వోత్కర్షతో వెలుగుతున్నారు.

అహంకారమమకారాలను కూరేశులు పోగొట్టిన రీతిని గత శ్లోకంలో అనుగ్రహించిన స్తుతికర్త ఈ శ్లోకంలో వాటివల్ల కలిగే పాపాలు, వాటి ఫలంగా కలిగే నరకం మొదలైన కలియుగదోషాలను అన్నిటినీ కూరేశులు పోగొట్టి మానవులకు ఆనందాన్ని కల్గిస్తున్నారు- అని అంటున్నారు.

కూరేశుల కటాక్షాలకు ఎన్ని విశేషణాలు ప్రయోగింపబడ్డాయి- అనే విషయం గమనార్హం. అవి సత్ఫలాన్ని తప్పకుండా ఇచ్చే, తీరాన్ని దాటి ప్రవహించే ప్రవాహాల వంటివి. మననుండి ఎటువంటి ఫలాన్ని ఎదురుచూచి ప్రవర్తించేవి కావు. లోపల ఉండే దయవల్ల తడిసి చల్లబడి, సకలతాపాలను తీర్చేవి అవి. అందువల్ల సాటి లేనివి అని స్తుతికర్త అంటున్నారు. నిజానికి భగవత్కటాక్షాలకుకూడ ఎవరూ ఇన్ని విశేషణాలను ప్రయోగించి వర్ణించలేదని అనవచ్చు. "కూరేశుల దయ," కూరేశుల కటాక్షం అంటే అవి అసాధారణమైనవి కదా!

శ్రీవైష్ణవశ్రీ అంటే - శ్రీమన్నారాయణుడే శేషి; అతడే మోక్షోపాయం; అతని శ్రీపాదాలలో పరిచర్యే పరమపురుషార్థం- అనే జ్ఞానం, ఆ స్వామిపట్ల అనన్య ప్రయోజనం అయిన భక్తి, ఇతరవిషయాలలో విరక్తి మొదలైనవి. వీటిని చాల బాగా పొందినవారు కూరేశులు అనే విషయాన్ని **"శ్రీమాన్"** అనే పదం తెలుపుతున్నది.

ఈ స్తుతికర్త కూరేశులను **"మమ కులగురుః"** అని నిర్దేశించి నందువల్ల, వీరు కూరేశుల వంశంలో అవతరించి ఉండవచ్చుననే సందేహం కల్గుతున్నది. పెద్దల సూక్తి ఈ విషయంలో ప్రమాణం.



24. **అవిద్యామాహాత్మ్యా దవిదితనిజాకారవిభవాన్**
**అశేషా నుద్ధర్తుం భవజలధిమగ్నాన్ జనిభృతః ।**
**అసౌ కూరాధీశః స్వయ మవతరన్ భూరికృపయా**
**నయన్ నావం విష్ణుం విగతతరపణ్యాం విజయతే ॥**

**అసౌ కూరాధీశః=** ఆ కూరత్తాழ்వాన్, **అవిద్యామాహాత్మ్యాత్ =** దుష్కర్మ మహిమ చేత, (అవిద్యయొక్క మహిమ చేత), **అవిదిత నిజాకారవిభవాన్ =** తమ యథార్థ స్వరూపం అయిన భగవచ్ఛేషత్వంయొక్క గొప్పతనాన్ని తెలియనివారై (అందువల్ల), **భవజలధిమగ్నాన్ =** ఈ లౌకికజీవనం అనే దుఃఖసముద్రంలో మునిగి ఉండే, **జనిభృతః అశేషాన్** = జన్మను పొందిన అందరినీ, **ఉద్ధర్తుం =** ఉద్ధరించడంకోసం, **భూరికృపయా =** గొప్ప కరుణతో, **స్వయమ్ అవతరన్ =** తామే అవతరించి, **విష్ణుం నావం =** విష్ణువు అనే పడవను, **విగతతరపణ్యాం =** ఓడ కూలి (సొమ్ము) లేకుండానే, **నయన్ =** నడిపించేవారై, **విజయతే=** సర్వోత్కర్షతో ప్రకాశిస్తున్నారు.

పూర్వం నాల్గవ శ్లోకంలో కూరేశులు సంసారసముద్రంలో మునిగినవారిని ఉద్ధరించాలనే వ్రతాన్ని గ్రహించారని, అయిదవ శ్లోకంలో ఆ కూరేశులు అవతరించి ఉండకపోతే జనులు ఏ విధంగా ఆ సముద్రాన్ని దాటగలరు? అని, ఏడవ శ్లోకంలో ఆ మానవులకు భగవచ్ఛేషత్వజ్ఞానాన్ని ఉపదేశించి ఉపకరించేవారని, పదవ శ్లోకంలో అమృతం పుట్టే క్షీరాబ్ధివంటివారని పల్కినది అంతా మనస్సులో ఉంచుకొని ఈ శ్లోకంలో జనులు తాము చేసిన దుష్కర్మల ప్రభావంచేత "తమ ఆత్మస్వరూపం భగవానునకు శేషభూతమే తప్ప స్వతంత్రం కాదు" అని తెలియలేక స్వతంత్రం అని భావించడానికి వీలుగా, యథేష్టంగా ఇంకా ఇంకా దుష్కర్మలను ఆచరించి సంసారసముద్రంలో మునిగి ఉన్నారు. వీరికి "ఆత్మస్వరూపం భగవానునకు శేషమై ఉన్నది" అనే స్వరూపజ్ఞానాన్ని కల్గిస్తే, ఇంకా ఇంకా పాపాలను చేయడం మానివేస్తారు. భగవానుడు ఇష్టపడిన సత్కార్యాలనే చేస్తారు. అందువల్ల వీరు చింతించవలసిన పనిలేదు" అని భావించి, పరమకృపతో తామే అవతరించి, ముందు తెలిపిన స్వరూప జ్ఞానాన్ని తమ ఉపదేశంతో చేతనులకు కల్గించి, సంస్కరించి, ఒక నావతో సముద్రాన్ని దాటవలసి ఉన్నట్లే, వారిని భగవానుడనే నావలో ఎక్కించి, (భగవానునకు రక్ష్య వస్తువులుగా చేసి) ఆ నావ సహాయంతో వారిని సంసారసముద్రంలో మునగకుండా ఉండేటట్లు దాటిస్తున్నారు - అని ఇందులో స్తుతికర్త తెలుపుతున్నారు. నావ అయిన భగవానుడు కూరేశులకు స్వంతం కనుక, వారు తమకు ఇష్టమైన వారిని, నావను దాటించడానికి చెల్లించవలసిన కూలి సొమ్మును చెల్లించనవసరం లేకుండానే,

నిర్హేతుకకృపతో ఆ నావను నడిపి, సంసారసముద్రాన్ని దాటించి పరమపదాన్ని చేరుస్తున్నారు - అని అంటున్నారు. ఈ సందర్భంలో **"ఞాన మనుట్టాన మివై నన్గాకవే యుడైయనాన కురువై యడైన్దక్కాల్ మానిలత్తీర్! తేనార్ కమలత్తిరు మామకళ్ కొழுన్ తానే వైకున్దమ్ తరుమ్"** (జ్ఞానం, అనుష్ఠానం అనే రెండు చక్కగా కల గురువును ఆశ్రయించగల్గితే, ఓ లోకులారా! తేనె నిండిన కమలంలోని లక్ష్మీదేవికి భర్త అయిన పరమాత్మ తానే స్వయంగా పరమపదాన్ని అనుగ్రహిస్తాడు) అనే ఉపదేశరత్తినమాలై పాశురాన్ని స్మరించడం యుక్తం. చాల గొప్పవారైన ఆచార్యులు తమను ఆశ్రయించిన శిష్యులకు స్వరూపజ్ఞానాన్ని కల్గిస్తే, భగవానుడు స్వరూప జ్ఞానాన్ని పొందిన వీరిని తానే నావవలె ఉండి సంసారసముద్రాన్ని దాటిస్తాడు- అని భావం. వేదంకూడ **"నావేవ యాంత ముభయే హవంతే"** అని అంటూ భగవానుని నావగా పల్కింది.

25. **పలాయధ్వం వేగాత్ క్వచన కథకాః కాననతలే**
**నిలీనా భూయాస్త ప్రతికథకమత్తేభమృగరాట్ ।**
**జయీ నానాతంత్రప్రవచనచణైః ప్రౌఢవచనైః**
**సమేతః శిష్యైఘై రటతి వసుధాం కూరనృపతిః ॥**

**ప్రతికథకమత్త+ఇభమృగరాట్=** ప్రతివాదాన్ని చేసేవారనే మత్తగజాలను చంపే సింహం వంటివారైన, **కూరనృపతిః=** కూరేశులు, **నానాతంత్రప్రవచనచణైః=** పలు రీతులలోని శాస్త్రార్థాలను వివరించడంలో సామర్థ్యాన్ని కల్గిన, **ప్రౌఢవచనైః =** గంభీరాలైన తమ శ్రీసూక్తులతో, **జయీ=** మిమ్ములను జయించేవారై, **శిష్య+ఓఘైః సమేతః=** (తమవంటి) శిష్యసమూహంతో కూడినవారై, **వసుధామ్ అటతి=** భూమిలో సంచరిస్తున్నారు; **కథకాః=** వ్యర్థప్రలాపాలను చేసేవారలారా! **వేగాత్=** వేగంగా, **క్వచన పలాయధ్వం=** ఎక్కడకు అయినా పలాయనం చేయండి, **కాననతలే=** అరణ్య ప్రాంతంలో, **నిలీనా భూయాస్త =** అదృశ్యులు కండి.

పూర్వం ఆత్మస్వరూపజ్ఞానం లేనందువల్ల సంసారసముద్రంలో మునిగి ఉండే చేతనులకు స్వరూపజ్ఞానాన్ని కల్గించి, భగవానునితో చేర్చి, ఆ స్వామిద్వారా ఆ సముద్రాన్ని కూరేశులు దాటింప జేస్తున్నారు- అని అన్నారు. ఎంతగా ఉపదేశాన్ని చేసి స్వరూప జ్ఞానాన్ని కలిగించాలని చూచినా, స్వరూపాన్ని తెలియనీయకుండా ఆ యా మత సిద్ధాంతాలను ప్రలపిస్తూ ప్రచారం చేసే అన్యమతస్థులు ఉండేంతవరకు ఆ స్వరూపజ్ఞానానికి అవరోధం కలుగుతుంది - అనే భయంవల్ల అన్యమతస్థులుకూడ కూరేశులకు వశులై, జితులై, దుఃఖించకుండా ఉండాలనే



దయతోను వారిని ఆ కూరేశులనుండి దూరంగా తరిమి వేస్తున్నారు. ఈ శ్లోకంలో కూరేశులను సింహంగా, అన్యమతస్థులను మత్తగజాలుగా రూపణం చేస్తున్నారు. సింహానికి మాత్రమే మత్తగజాల కుంభస్థలాలను భేదించే శక్తి ఉన్నందువల్ల, మిగిలిన మృగాలను వధించడం సింహానికి అతిశయావహం కానందువల్ల, కూరేశులను సింహం అని, అన్య మతస్థులను మత్తగజాలుగానే స్తుతికర్త పలికారు. కూరేశులనే ఒక సింహమే కాదు; వారివలె బాహ్యమతస్థులను నిరసించగల్గిన శక్తిని కల శిష్యులు అనే పలు సింహాలు సంచరిస్తున్నాయి. కనుక ఇక మీకు ఉజ్జీవనం లేదు. ఎక్కడికి అయినా పరుగెత్తి పోయి దాగుకొనండి- అని వారికికూడ హితోపదేశాన్ని చేశారు.

26. **శ్రుతిశ్రేణీచూడాయసముసల మాదాయ శఠజిత్-**
**వచఃశ్రేణీనిత్యానుభవనిరతో జృంభితమదః ।**
**ప్రధావన్నభ్యేతి ప్రతికథకవాదాహవరుచిం**
**నిరుంధన్ కూరేశద్విరదనృపతిః బృంహితరవైః ॥**

**(హే కథకాః =** ఓ ప్రతివాదులారా!) **శఠజిత్ వచః శ్రేణీ నిత్యానుభవనిరతః =** శఠకోపులైన నమ్మాழ்వార్ల తిరువాయ్మొழி మొదలైన శ్రీసూక్తి సమూహాలను ఎల్లప్పుడూ అనుభవించడంలో చాల అభినివేశాన్ని కల్గినదిగా, **జృంభితమదః =** వృద్ధిచెందిన మదాన్ని కల్గినదిగాను ఉండే, **కూరేశ ద్విరదనృపతిః =** కూరత్తాழ்వాన్ అనే గొప్ప ఏనుగు, **శ్రుతిశ్రేణీచూడా + ఆయసముసలమ్ =** ఉపనిషత్తులనే ఇనుప రోకలిని, **ఆదాయ =** తీసికొని, **బృంహితరవైః =** ఘీంకార శబ్దాలతో, **ప్రతికథక వాద+ ఆహవరుచిమ్ =** ప్రతివాదం చేసేవారికి వాదించడంలో గల రుచిని, **నిరుంధన్ =** అడ్డగిస్తూ, **ప్రధావన్ అభ్యేతి =** మీ వైపుకు పరుగెత్తుకొని వస్తున్నది.

"ఎక్కడికి అయినా పారిపోండి, అరణ్యంలోకి పోయి అదృశ్యులు అయినా కండి" అని గత శ్లోకంలో చెప్పబడిన విషయాన్ని ఇక్కడకూడ గుర్తు చేసుకొవాలి. అదే విధంగా ఆ శ్లోకంలోని **"కథకాః"** అనే సంబోధననుకూడతెచ్చి, అన్వయించు కోవాలి.

గడచిన శ్లోకంలో, **"కలి మిక్క శెన్నెల్"** అనే ఇరామానుశనూற்றన్దాది పాశురంలో **"వలి మిక్క శీయమ్ ఇరామానుశన్"** (గొప్ప బలిమిని కల సింహం రామానుజులు) అని భగవద్రామానుజులను సింహంగా రూపించినట్లే, వారి శిష్యులైన కూరేశులను సింహంగా నిర్దేశించారు. అదే విధంగా, ఆ ప్రబంధంలో గల **"పణ్డరు మాఱన్ పశున్దమిழ் ఆనన్దమ్ పాయ్ మద మాయ్ విణ్డిడ ఎఙ్గ ళిరామాశ మునివేழமమ్ మెయ్మ్మై కొణ్డ నల్ వేదక్కొழுన్దణ్డ మేన్ది క్కువలయత్తే మణ్డివన్దేన్దదు వాదియర్కాళ్!**

**ఉజ్గళ్ వా*ళ్గ్*వు అ*గ్ఱ్*ఱతే"** (మా రామానుజులనే ఏనుగు నమ్మా*ళ్వా*ర్లు సంగీతాత్మకంగా అనుగ్రహించిన, అందమైన ద్రావిడభాషలోని తిరువాయ్మొ*ళ్ణి* ప్రబంధంవల్ల కలిగిన అనందం ప్రవహించే మదజలమై వ్యాపించగా, సత్యమై, విలక్షణం అయిన వేదం అనే గొప్ప గదను గ్రహించి భూలోకంలోనికి చొచ్చుకొని వచ్చింది. ప్రతివాదులారా! మీ ఉజ్జీవనం నశించింది) అనే పాశురాన్ని చాలవరకు అనుసరిస్తూ, అందులో శ్రీరామానుజులను మదగజంగా రూపించినట్లే ఈ శ్లోకంలో కూడ కూరేశులను మదగజంగా స్తుతికర్త నిర్దేశిస్తున్నారు.

ఆ పాశురంలో, ప్రకృతశ్లోకంలోను భగవద్రామానుజులకు, కూరేశులకు మధ్య తిరువాయ్మొ*ళ్ణి* మొదలైన ఆ*ళ్వా*ర్ పాశురాల అనుసంధానమే మదంగా స్రవించడం, వేదాంతాలే రోకలి అనే ఆయుధంగా కావడం సమానం. ఇరామానుశ నూ*ఱ్ఱ*న్దాదిలో **"మణ్డివన్దేన్దదు వాదియర్కాళ్! ఉజ్గళ్ వా*ళ్గ్*వు అ*గ్ఱ్*ఱదు"** అని పల్కడం "మీ వైపుకు వస్తున్నది. ఓ ప్రతివాదులారా! ఎక్కడికి అయినా పరుగెత్తి పోయి దాగుకొనండి'' అని ఇక్కడ పల్కడం గమనించదగినవి. రోకలి శత్రువులను సంహరించే సాధనం. వేదాంతం అనే రోకలి, ప్రతివాదం చేసేవారి సిద్ధాంతాలను నిర్వీర్యం చేస్తుంది. భగవద్రామానుజులు, కూరేశులు తమ ఆనందానికి విషయంగా అనుభవించేది ద్రావిడవేదాలనే అని, బాహ్యమతాలను జయించడంకోసం ఉపయోగించేది సంస్కృతవేదాలనే అని ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాది పాశురంలోను, ఈ శ్లోకంలోను స్పష్టంగా చెప్పబడింది.

27. **అసారం సంసారం బహుళతరదుఃఖాకర మిమమ్**
**విసృజ్య శ్రీమంతం భజత విభు మానందభరితమ్ ।**
**ఉదార స్సర్వేభ్యో వితరతి జనాః స్వేన సమతామ్**
**అసా విత్యత్రత్యానుపదిశతి కూరాధిపగురుః ॥**

**హే జనాః** = ఓ జనులారా!, **కూరాధిపగురుః** = కూరేశులనే ఆచార్యులు, **బహుళతరదుఃఖాకరం** = చాల విధాలైన దుఃఖాలకు జన్మస్థానమైనది, **అసారం** = సారమైన ఆనందం కొంచెంకూడ లేనిది అయిన, **ఇమమ్ సంసారం** = ఈ లౌకిక జీవనాన్ని, **విసృజ్య** = విడిచిపెట్టి, **ఆనందభరితం** = ఆనందంతో నిండినవాడై, **విభుం** = అన్నిటికీ సమర్థుడైన, **శ్రీమంతం** = లక్ష్మీవల్లభుడైన స్వామిని, **భజత** = భజించండి, **ఉదారః అసౌ** = గొప్ప దాత అయిన అతడు, **సర్వేభ్యః** = (వీరు ఇటువంటివారు అని చూడకుండా, తనను ఆశ్రయించిన) అందరికీ, **స్వేన సమతాం**= తనతో సామ్యాన్ని (తన ఆనందంతో సమానమైన ఆనందాన్ని), **వితరతి**=



ఇస్తాడు, **ఇతి** = అని, **అత్రత్యాన్** = ఈ లోకంలోని చేతనులనుగూర్చి, **ఉపదిశతి** = ఉపదేశిస్తున్నారు.

గడచిన రెండు శ్లోకాలలో స్తుతికర్త కూరేశులు ప్రత్యర్థులపట్ల సింహంవలె, గజంవలె ప్రవర్తించి, వారిని భీతిల్లి జేస్తున్నారు- అని పల్కి, ఈ శ్లోకంలో వారు సత్పురుషులకు ఉపదేశం చేసే తీరునుగూర్చి పల్కుతున్నారు.

ఈ లోకజీవనంలో నిజానికి ఆనందం అనేది లేనే లేదు. ఉన్నది అంతా దుఃఖమే. దీనిని పూర్తిగా విడిచిపెట్టండి. "మేము విడిచినా, అది మమ్ములను విడువను అని అంటుంది కద! ఏం చేయము?-'' అని అడుగకండి. అన్ని విధాలైన సామర్థ్యాలను కల్గిన, ఆనందగుణపూర్ణుడైన శ్రీమన్నారాయణుని శరణంగా ఆశ్రయించండి. అతడు దుఃఖమయం అయిన ఈ సాంసారికజీవనంనుండి మిమ్ములను విడిపించి, మీ కోసమై ఉండే పరమపదాన్ని ఇచ్చి, తనకున్న అంతటి ఆనందాన్ని మీకు ఇస్తాడు. అంతటి గొప్పవాడు మన దరిచేరుతాడా? అని సందేహించవద్దు. అంతులేని ఆనందాన్ని మనకు అనుగ్రహించేటట్లు ఆ స్వామి ప్రక్కనే ఉన్న లక్ష్మీదేవి మన విషయంలో పురుషకారం చేస్తుంది. శీఘ్రంగా ఆ స్వామిని ఆశ్రయించండి'' అని ఆచార్యులు కనుక ఉపదేశిస్తున్నారు అని అంటున్నారు. ఈ సందర్భంలో **"తమ్మైయే నాళుమ్ వణఙ్గి తొ*ళ్ణు*వార్కు తమ్మైయే యొక్క అరుళ్ శెయ్వర్"** (తనను నిత్యం నమస్కరించి, సేవించేవారికి తనతో పరమసామ్యాపత్తిని అనుగ్రహిస్తాడు) అనే పెరియతిరుమొ*ళ్ణి* (11-3-5) సూక్తిని స్మరించడం యుక్తం, **"హే జనాః! శ్రీమంతం భజత, ఉదారః సః సర్వేభ్యః వితరతి"** అని అన్నందున భగవానుని ఆశ్రయించడానికి, మోక్షం పొందడానికి వీరు అర్హులు, ఇటువంటివారు అర్హులు, వీరు అర్హులు కాదు అనే భేదం లేదు - అని తెలుపబడినట్లయింది.

28. **విరక్తానా మగ్ర్యో విమలచరితో వైదికవరో**
**వినేత్యా చారాణాం విగతమదమోహాదిమగుణః ।**
**అసూయానిర్ముక్తః శమదమముఖానంతసుగుణః**
**సదా శ్రోత్రానందం కలయతి పరం కూరనృపతిః ॥**

**విరక్తానాం** = ఆశ లేనివారిలో, **అగ్ర్యః**=మొట్టమొదటివారు, **విమలచరితః**= దోషంలేని నడవడికను కలవారు, **వైదికవరః** = వేదాన్ని ప్రమాణంగా పరిగ్రహించే వారిలో గొప్పవారు, **ఆచారాణామ్** = ఆ వేదంలో విధింపబడ్డ ఆచారాలను, **వినేతా**= శిష్యులు అనుష్ఠించేటట్లు చేసేవారు, **విగతమదమోహ+ఆదిమగుణః** = గర్వం,

అజ్ఞానం మొదలైన దుర్గుణాలు లేనివారు, **అసూయానిర్ముక్తః** = ఓర్వలేనితనాన్ని కొంచెంకూడా లేనివారు, **శమదమముఖ + అనంతసుగుణః** = మనోనిగ్రహం, బాహ్యేంద్రియ నిగ్రహం కలవారు అయిన, **కూరనృపతిః** = కూరేశులు, **సదా** = ఎల్లప్పుడు, **శ్రోత్రానందం** = చెవులకు ఆనందాన్ని, **పరం కలయతి** = బాగా కల్గిస్తున్నారు.

ఈ శ్లోకానికి (పూర్వ) ముందు శ్లోకంలో కూరేశులు లోకంలోని జనులను ఉద్దేశించి, "శ్రియఃపతియే పరతత్త్వం, అతడు పరమపదంలో అనుభవించే ఆనందంవంటి మోక్షానందమే పురుషార్థం. దానిని పొందడానికి అతనిని శరణంగా ఆశ్రయించాలి" అని పల్కిన తమ వద్దకు కొందఱు వచ్చి "కూరేశులు చేసే ఉపదేశం నమ్మదగినదేనా! మిగిలిన మతాలకు చెందినవారుకూడా ఏవో కొన్ని ఉపదేశాలను చేస్తున్నారు. అవి అన్నీ అసత్యాలు అని, వీరి ఉపదేశంమాత్రం సత్యం అని మేము ఏవిధంగా నమ్మగలము?" అని ప్రశ్నించగా, "కూరేశులు ఏ దోషాన్ని లేనివారు. సద్గుణపూర్ణులు. ఇంకా ఆచార్యలక్షణాలు అన్నీ కల్గినవారు. వారు ఉపదేశించే ఉపదేశాలు అన్నీ ఎల్లప్పుడూ ఒకే రీతిని కల్గినవై కర్ణామృతాలుగా ఉంటాయి. అసత్యంగా ఉంటే అవి కొన్నాళ్ళు తీయగా ఉన్నా, కాలాంతరంలో, సహించలేనివి కావా!" అని అంటూ వారికి ఇందులో బదులిస్తున్నారు.

**"ఆచినోతి హి శాస్త్రార్థా నాచారే స్థాపయత్యపి, స్వయ మాచరతే యస్తు ఆచార్య స్సోఽభిధీయతే"** అని ఆచార్యలక్షణం. ఎవడు వేదం అనే శాస్త్రంయొక్క అర్థాలను తెలిసికొంటున్నాడో, తాను నడచే రీతిలోనే తనను చేరినవారినికూడ నడిపిస్తాడో అతడే ఆచార్యుడనబడుతున్నాడు - అన్నది ఈ నిర్వచనంలోని భావం.

ఈ లక్షణాలలో మొదటిది - ఈ శ్లోకంలో **"వైదికవరః"** (వేదాన్ని ప్రమాణంగా గ్రహించినవారిలో ముఖ్యులు) అని దానివల్ల తెలుస్తున్నది. వేదార్థాలను చక్కగా అభ్యసిస్తేకదా ఆ అర్థాలను అన్నిటినీ తెలియగలడు. **"విమలచరితః"** అని అన్నందున, **"ఆచారాణాం వినేతా"** అని అన్నందున, క్రమంగా - ఆ వేదార్థాలకు పొసగేటట్లు ఏ దోషం లేకుండా ప్రవర్తించి చూపించడం అనే ద్వితీయలక్షణం, అదే విధంగా తనను ఆశ్రయించిన వారుకూడ నడిచేటట్లు చేయడం అనే తృతీయ లక్షణం సూచింపబడడం గమనార్హం. మిగిలిన విశేషణాలతో కూరేశులకు ఆశ, అసూయ మొదలైన దోషాలేవీ లేవని, ఇంద్రియనిగ్రహం, మనోనిగ్రహం మొదలైన సద్గుణాలు అన్నీ ఉన్నాయని స్ఫుటమవుతున్నది.

అందుచేత, "కూరేశులు అన్ని విధాలైన గొప్పతనాలను తమలో కల్గినవారు కనుక, వారు చేసే ఉపదేశం నమ్మదగినదే. మీరు ఆ ఉపదేశానుసారం నడచు



కోవడం మంచిది. బాహ్యమతస్థులు వేదాలను ప్రమాణంగా గ్రహించనందు వల్ల, వానికి అనుగుణంగా తాము ప్రవర్తించకుండా, ఇతరులనుకూడ ప్రవర్తించ నీయకుండా చేస్తున్నందువల్ల వారి ఉపదేశాలు నమ్మదగినవి కావు" - అని వారికి సమాధానాన్ని చెప్పినట్లయింది.

29. **యదీయేక్షాపాత్రం భజతి మనుజః ప్రేమపదతాం**
**పరం పద్మాభర్తుః పతితజనచూడామణి రపి ।**
**యదీయా శ్రీసూక్తిః నిఖిలనిగమాంతార్థవివృతిః**
**స జీయాత్ కూరేశః సకలశుభసంతానసరణిః ॥**

**యదీయా + ఈక్షాపాత్రం** = ఎవరి చూపుకు లక్ష్యం అయిన, **మనుజః** = మానవుడు, **పతితజనచూడామణిః + ఆపి** = జాతి, ఆచారాలలో భ్రష్టులైన వారిలో అత్యంతప్రథముడైనా, **పద్మాభర్తుః** = శ్రియఃపతి అయిన స్వామియొక్క, **ప్రేమపదతాం** = ప్రేమకు లక్ష్యం అయే స్థితిని, **భజతి** = పొందుతున్నాడో, **యదీయా**= ఎవరియొక్క, **శ్రీ సూక్తిః** = మంచి మాట, **నిఖిలనిగమ + అంత + అర్థవివృతిః** = సకలవేదాంతాల అర్థాలకు వ్యాఖ్యానమై ఉంటుందో, **సః** = ఆ, **సకలశుభసంతాన సరణిః** = సకలమంగళ సమూహానికి మార్గం అయిన, (ఉపాయం అయిన) **కూరేశః జీయాత్** = కూరత్తాழ்వాన్ సర్వోత్కర్షతో ప్రకాశించుగాక!

కూరేశులు ఉపదేశం నమ్మదగినది అనేదానికి ప్రమాణంగా వారియొక్క మిగిలిన కొన్ని గొప్పతనాలనుగూర్చి ఇందులో కవి ప్రస్తావిస్తున్నారు.

"లోకంలో ఒకడు కూరేశుల కటాక్షాన్ని పొందినట్లయితే, అతడు అంతకు ముందు సకలవిధాలైన భ్రష్టాచారాలను కలవాడైనా, లక్ష్మీనాథుని అనుగ్రహాన్ని పొంది మోక్షానికి చేరుతాడు. సహవాసదోషం వల్ల వైదిక వేషాన్ని విసర్జించి బౌద్ధమతంలోకి చేరిన వైదిక బ్రాహ్మణ యువకుడు ఒకడు కూరేశుల కటాక్షఫలంగా తిరిగి వైదికుడుగా మారిన ఐతిహ్యం ఇక్కడ స్మరణీయం. వారి శ్రీసూక్తులన్నీ వేదాంతార్థాలను విశదీకరిస్తున్నవి. వారి కటాక్షం మోక్షానికే కాక, ఇక్కడ ఈ లోకంలో ఉండే కాలంలో అర్చావతార భగవానుని కైంకర్యాలకు తగిన సంపద, **"నన్మక్కళై పెఱ్ఱ్రు మకిழ்వరే"** అన్నట్లుగా చక్కని రీతిలో సుఖజీవనాన్ని సాగించడానికి ఆవశ్యకాలైన అనుకూలవతి అయిన భార్య, సత్సంతానం, బంధువులు మొదలైన అన్ని సౌకర్యాలకు ఉపాయం అవుతుంది. అందువల్ల వారి ఉపదేశం నమ్మదగినది"- అని అన్నట్లయింది.

30. **విశుద్ధజ్ఞానాబ్ధిః విగతమమకారః స్వపరయోః**
**వినేతా సర్వేషా మతివిమలబోధస్య విదుషామ్ ।**
**విహర్తా శ్రీరంగిప్రియతమయతీశానపదయోః**
**ప్రహర్తాఽసౌమ్యానాం భవతి భవినాం కూరనృపతిః ॥**

**కూరనృపతిః** = కూరేశులు, **విశుద్ధజ్ఞాన + అబ్ధిః** = మిక్కిలి పవిత్రం అయిన జ్ఞానానికి సముద్రంగా, **స్వపరయోః** = తన పట్ల, ఇతరులపట్ల (ఇంతకు ముందున్న), **విగతమమకారః** = నేను, నాకు చెందినవాడు, ఇది అంతా నాది అనే భావాన్ని తొలగినవారుగా, **సర్వేషాం విదుషాం** = జ్ఞానం కలవారికి అందరికీ, **అతివిమల బోధస్య=** (తమ జ్ఞానంవంటి) మిక్కిలి నిర్మలం అయిన జ్ఞానాన్ని, **వినేతా** = చక్కగా పొందించేవారుగా, **శ్రీరంగిప్రియతమయతీశానపదయోః** = శ్రీరంగనాథుని ప్రేమకు మిక్కిలి లక్ష్యం అయిన యతిరాజుల శ్రీపాదాలలో, **విహర్తా** = క్రీడించేవారుగా, **అసౌమ్యానామ్** = (మొరటు వారైన) దుష్టులైన, **భవినాం** = సంసారులను, **ప్రహర్తా=** శిక్షించేవారుగాను, **భవతి** = ఉన్నారు.

ఈ శ్లోకంకూడా కూరేశుల మహిమలనే వర్ణిస్తున్నది. "నేను- నాది అని ఇంతవరకు భావించిన వస్తువులు భగవానునకు చెందిన వస్తువులే" అనే పరిశుద్ధమైన జ్ఞానాన్ని కలవారు కనుక "నేను నాకు చెందినవాడను. స్వతంత్రుడను. ఇవి అన్నీ నా వస్తువులు - అని భావించడం" అనే రెండు విధాలైన మమకారాలు తీరినవారు- అనేది మొదటి పాదంలోని భావం.

జ్ఞానాన్ని కలవారికి తమ జ్ఞానంవంటి, పూర్వం తెలుపబడ్డ పరిశుద్ధమైన జ్ఞానాన్ని కూరేశులు కల్గిస్తారు - అనేది రెండవ పాదంలోని భావం. జ్ఞానం లేని మొఅటువారై, "మేము మీ ఉపదేశాన్ని వినము" అని మొండిగా ఉండే సంసారసంబంధాన్ని కలవారిని శిక్షించేవారు, సంస్కరించేవారు" అని నాల్గవ పాదంలోని భావం. ఈ విధంగా ఉండడానికి కారణం అయిన ఉత్సాహం వీరికి ఎక్కడినుండి వచ్చింది? అని అంటే, శ్రీరంగనాథుని పరిపూర్ణ ప్రేమకు ఆస్పదులైన భగవద్రామానుజుల శ్రీపాదాల సేవను చేయడంవల్ల వచ్చింది - అనేది మూడవ పాదంలోని భావం.

31. **పురాణానాం పుంసాం సరణి మనుయన్ తత్త్వవివృతౌ**
**ప్రకృత్యాత్మేశానాం పరమత మపాస్యన్ననృతతామ్ ।**
**పరాకుర్వన్ తత్త్వప్రమితపదయోః జీవతమసోః**
**సమింధే కూరేశః శ్రుతిశిఖరసంతానశరణమ్ ॥**



**కూరేశః** = కూరేశులు, **ప్రకృతి+ఆత్మా+ ఈశానామ్** = మూలప్రకృతి, జీవాత్మ, పరమాత్మ అనే ముగ్గురియొక్క, **తత్త్వవివృతౌ** = సత్యత్వాన్ని వివరించడంలో, **పురాణానాం పుంసాం** = ప్రాచీనులైన పురుషులయొక్క, **సరణిం అనుయన్** = దారిని అనుసరించేవారై, **తత్త్వప్రమితపదయోః** = సత్యమైన తత్త్వాలే అని వేదప్రామాణ్యాన్ని బట్టి తెలియబడిన, **జీవతమసోః** = జీవాత్మ, మూలప్రకృతి- అనే వీటియొక్క, **అనృతతామ్** = అసత్యమైన స్థితిని, **పరాకుర్వన్** = నిరాకరించేవారై, (నిరాకరించడంద్వారా), **పరమతం** = అద్వైతమతాన్ని, **అపాస్యన్** = చాల దూరంలోకి గెంటివేసినవారై, **శ్రుతిశిఖరసంతానశరణం** = వేదాంత వాక్యసమూహాలను రక్షించేవారై, **సమింధే** = బాగా ప్రకాశిస్తున్నారు.

కూరేశులు వేదాంతవాక్యాలలో ఒక్కటిని కూడ విడువకుండ వాస్తవాలైన అర్థాలను తెలిపి, వాటిని రక్షిస్తూ ప్రకాశిస్తున్నారు- అని తెలిపే ఈ శ్లోకంకూడ వారి మహిమను కీర్తిస్తున్నది.

కూరేశులు తనకు తోచినట్లుగా ఇష్టం వచ్చిన రీతిలో ఏ విషయాన్ని పలుక కుండా, మన శ్రీవైష్ణవవిశిష్టాద్వైతసిద్ధాంతాన్ని ప్రచారం చేసిన పురాణ పురుషులైన వ్యాసపరాశర బోధాయనాది మహర్షులు, శఠకోపులు, కలివైరిసూరి మొదలైన దివ్యసూరులు, శ్రీమన్నాథమునులు, భగవద్యామునమునులు, భగవద్రామా నుజులు మొదలైన పూర్వాచార్యులు చూపిన సత్పథంలో ప్రవర్తించి, మూలప్రకృతి అయిన జడద్రవ్యం, చైతన్యాన్ని కల జీవాత్మ, పరమాత్మ - అనే ఈ మూడు తత్త్వాలు యథార్థాలని పల్కి, పరమాత్మవలె సత్యమైనవే అని వేదాంత వాక్యాలద్వారా తెలియబడే మూలప్రకృతి - జీవాత్మ అనే రెండు తత్త్వాలను అసత్యాలని పలికే అద్వైతుల వాదాలను నిరాకరించి, ఈ మూడు తత్త్వాలు సత్యాలను తెలిపే వేదాంతవాక్యాలను అన్నిటినీ రక్షించేవారై వెలుగొందుతున్నారు- అని తాత్పర్యం. **"తత్త్వప్రమితపదయోః"** అనే చోట గల **"పదమ్"** అనేది వస్తువును తెలుపుతుంది. **"పదమ్"** = పాదం, చోటు, వస్తువు. **"తమస్"** అనేది తమోగుణ ప్రాచుర్యాన్ని కల మూల ప్రకృతిని తెలుపుతుంది.

32. **స్వరూపాభివ్యక్తిం శ్రుతిశిఖరసిద్ధా మభిదధత్**
**నిరూప్యాం వృత్త్యైవాఖిలతనుభృతాం తాం చ కథయన్ ।**
**తదీయార్చాసీమాం స్వయ మపి వితన్వన్ యతిపతేః**
**అశేషం కైంకర్యం జయతి సుమతిః కూరనృపతిః ॥**

**సుమతిః కూరనృపతిః** = చక్కని జ్ఞానాన్ని కల కూరేశులు, **అఖిలతనుభృతాం**= సమస్తసంసారిజీవులయొక్క, **శ్రుతిశిఖరసిద్ధాం** = వేదాంతశాస్త్రంవల్ల సిద్ధించిన, **స్వరూప + అభివ్యక్తిం** = (ఇంతవరకు మఱుగుపడి ఉండే) స్వరూపంయొక్క ప్రకాశం అయిన మోక్షాన్ని, **వృత్త్యైవ** = భగవత్కైంకర్యంతోనే, **నిరూప్యాం** = నిరూపించదగినదిగా, **అభిదధత్** = పలికేవార్రై, **తాం చ** = ఆ వృత్తి అనే భగవత్ కైంకర్యాన్ని, **తదీయ + అర్చాసీమాం** = భాగవతకైంకర్యాన్ని తనకు అవధిగా కల్గిన దానినిగా, **కథయన్** = పలికేవార్రై, **స్వయమ్ అపి** = తాముకూడ, యతిపతేః = యతిరాజులయొక్క, **అశేషం కైంకర్యం** = కైంకర్యాలను అన్నిటినీ, **వితన్వన్** = విస్తృతంగా చేసేవార్రై, **జయతి** = సర్వోత్కర్షతో వెల్గుతున్నారు.

దీనికి ముందు కూరేశులు తమ పూర్వులు నడచిన దారినే అనుసరించి, అన్యమతస్థులను జయించి, ప్రకృతి - జీవుడు - పరమాత్మ- అనే ఈ మూడు తత్త్వాలు యథార్థాలు- అని నిరూపించిన రీతిని పల్కి, ఇపుడు వేదాంతసిద్ధం అయిన మోక్షం స్వరూపావిర్భావమే, దానికి ఫలం భగవత్కైంకర్యం; అది కూడ భాగవతకైంకర్య పర్యంతంగా కావాలి - అని ఉపదేశించి, ఆ రీతిలోనే తాము కూడా నడచుకొంటూ ఉన్నారు. - అని పల్కడంద్వారా వారి మహిమను స్తుతికర్త స్తుతిస్తున్నారు.

ఛాందోగ్యోపనిషత్తులో **"ఏష సంప్రసాదః అస్మాత్ శరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే"** (ఈ జీవాత్మ ఈ శరీరాన్ని విడచిపెట్టి బయలు దేరి, పరమాత్మను చేరి, ఇంతవరకు సంసారదశలో దుష్కర్మల వల్ల మఱుగుపడి ఉండే, తన యొక్క యథార్థమైన స్వరూపంతో వ్యక్తమవుతున్నాడు) అని తెలుపబడింది. జీవుని యథార్థ స్వరూపం- **"అపహతపాప్మా, విజరః, విమృత్యుః , విశోకః, విజిఘుత్సః, అపిపాసః, సత్యకామః, సత్య సంకల్పః"**- అనే ఎనిమిది విధాలైన గుణాలను కల్గినదిగా ఉంటుందని ఈ ఉపనిషత్తులోనే చెప్పబడింది. పాపం అంతా తీరిపోవడం, ముసలితనం లేకపోవడం, మరణం లేకపోవడం, దుఃఖం లేకపోవడం, ఆకలి లేకుండా ఉండడం, దాహం లేకుండా ఉండడం, భగవత్కైంకర్యానికి ఆవశ్యకాలైన అన్ని ద్రవ్యాలను నిత్యంగా పొందగల్గడం, కొత్తగా ఏదైన ఒక వస్తువు కావాలని తోస్తే, దానిని తలచిన రీతిలోనే పొందగల్గడం - అనే ఈ ఎనిమిది జీవాత్మకు సంబంధించిన స్వభావాలు. ఇటువంటి స్వభావాలు వ్యక్తం కావడమే ఈ శ్లోకంలో స్వరూపాభివ్యక్తిగా నిర్దేశింపబడిందని తెలియాలి. ఈ విధంగా పరమాత్మను చేరి, ఎనిమిది విధాలైన గుణాలను చాల బాగా ప్రకాశించేటట్లు పొందిన జీవుడు, తాను ఊరకనే ఉండలేనివాడై, ఆ పరమాత్మకు స్వరూపాను



రూపం అయిన కైంకర్యాన్ని అనుష్ఠిస్తాడు, కనుక, స్వరూపావిర్భావానికి ఫలం భగవత్కైంకర్యం. ఈ లోకంలో, పరమపదంలో మనం చేసే భగవత్కైంకర్యం మాత్రమే చాలదు. ఆ స్వామి భక్తులకుకూడా కైంకర్యాన్ని చేయడం స్వామికి కైంకర్యం చేయడంకంటే అతనికి చాల ప్రియం అవుతుంది. కనుక ఆ భగవత్ కైంకర్యం భాగవతకైంకర్యపర్యంతం పర్యవసించాలి. భాగవతులకు చేసే కైంకర్యంకంటే ఆ భాగవతులు అభిమానించే ఆచార్యులకు చేసే కైంకర్యమే ఆ భాగవతులకు మిక్కిలి ఆనందకరం. కనుక భాగవత కైంకర్యం ఆచార్య కైంకర్యాన్ని పరమావధిగా కల్గినది అవుతుంది. ఇటువంటి విషయాలను కూరేశులు తనను ఆశ్రయించినవారికి ఉపదేశించడంతో ఆగకుండా, తాము కూడ తమ ఆచార్యులైన భగవద్రామానుజులకు సర్వవిధకైంకర్యాలను చేసేవారు. శ్రీరామానుజులకు చేసే కైంకర్యాలు భాగవతులకు ఆనందాన్ని కల్గించి, తద్ద్వారా భగవానుని ఆనందానికి కారణం అవుతాయి. కనుక కూరేశులు ముందు తెల్పిన రీతిలో భగవత్ - భాగవత - ఆచార్య కైంకర్యాలను చేసినవారయ్యారు. ఇది అంతా కూరేశుల వైభవం.

అంతేకాక, **"యతిపతేః"** అనే షష్ఠీవిభక్తి అభిమతార్థంలో ప్రయుక్తమైనదని గ్రహించి, యతిపతికి అభిమతం అయిన భగవద్భాగవత కైంకర్యాలు, తమ కైంకర్యం - అనే ఈ మూడింటిని సాక్షాత్తుగా నిర్దేశిస్తున్నదని చెప్పడంకూడ తగినదే.

**33. నిరాలంబం కౌతస్కుతమత మసారం నిజవచః -**
**ప్రపంచైః వేదాంతప్రచురఫణితార్థా ననుగతైః ।**
**పరాకుర్వన్ ప్రౌఢప్రమితిజనకైః లక్ష్మణమునేః**
**పరిష్కుర్వన్ భాష్యం ప్రథయతి మతం కూరనృపతిః ॥**

**కూరనృపతిః** = కూరేశులు, **వేదాంతప్రచురఫణితార్థాన్** = ఉపనిషత్తులలో ఒక విషయాన్నిగూర్చి ప్రచురంగా ఉండే వాక్యాల అర్థాలను, **అనుగతైః** = అనుసరించినవి, (అందువల్ల), **ప్రౌఢప్రమితిజనకైః** = పరిపక్వం అయిన, స్వచ్ఛమైన జ్ఞానాన్ని కల్గించేవి అయిన, **నిజవచఃప్రపంచైః** = తమ మాటల విస్తారాలచేత, (వివరంగా ఉండే తమ మాటలతో), **నిరాలంబం** = ఆధారం లేనిది, **అసారం** = సారమైన అర్థాన్ని లేనిది, అయిన, **కౌతస్కుతమతం** = ఎందువల్ల, ఎందువల్ల (కుతః? కుతః?-) అని ప్రశ్నించే యుక్తి మాత్రవాదుల మతాన్ని, **పరాకుర్వన్** = నిరాకరించేవార్రై, **లక్ష్మణమునేః** = భగవద్రామానుజమునుల, **భాష్యం పరిష్కుర్వన్** = శ్రీభాష్యాన్ని ప్రకాశింపజేసేవార్రై, **లక్ష్మణమునేః**= యతిరాజుల, **మతం** = మతాన్ని, **ప్రథయతి** = ప్రసిద్ధం చేస్తున్నారు.

గత శ్లోకంలో కూరేశులు భగవద్రామానుజులకు అన్ని విధాలైన కైంకర్యాలను చేస్తున్నారు - అని తెలిపారు. వారికి సేవలను చేయడమే కాదు; వారు అనుగ్రహించిన శ్రీభాష్యంద్వారా వారి సిద్ధాంతాలను ప్రచారం చేయడంకూడ శ్రీరామానుజులకు చేసే సేవే అవుతుంది. కనుక, వారు ఆ ప్రచారాన్ని చేసే తీరును ఇందులో అనుగ్రహిస్తున్నారు. అ విధంగా పల్కడంకూడా కూరేశుల వైభవాన్ని వర్ణించినట్లే కదా అవుతుంది.

ఉపనిషత్తులలో ఒక దానితో వేఱొకటి విరోధించేటట్లుగా రెండు అర్థాలు చెప్పబడి ఉంటే, వాటిలో ఏదో ఒక అర్థమే యథార్థమై ఉండే అవకాశం ఉన్నది. కనుక, ఆ రెండింటిలో ఏది సత్యం? ఏది సత్యం కాదు? అని తెలియడం ఏ విధంగా? అనే ప్రశ్న తల ఎత్తుతుంది. ఏ అర్థం పలు వాక్యాలలో చెప్పబడి ఉన్నదో అదే నిజం. దానినే గ్రహించాలి. ఏ అర్థం కొన్ని వాక్యాలలో మాత్రమే చెప్పబడి ఉన్నదో అది యథార్థం కాదు. దానిని యథాతథంగా గ్రహించకూడదు. తత్సమమైన అర్థానికి అనుగుణంగా దానికి అర్థాన్ని చెప్పుకోవాలి - అని మన పూర్వాచార్యులు తెలియజేశారు. దానిని అనుసరించి కూరేశులుకూడ ఉపనిషత్తులలో పలు వాక్యాలలో చెప్పబడ్డ అర్థాలనే సత్యమని ప్రతిపాదించారని తాత్పర్యం.

ఈ విధంగా ఉపనిషత్తులలో పలు వాక్యాలతో దృఢీకరింపబడ్డ అర్థాలనే స్పష్టంగా తెలిపే తమ శ్రీసూక్తులతో కౌతస్కుతుల (హేతువాదుల) మతాన్ని కూరేశులు ఖండించారు. ఒక ప్రమాణాన్ని మూలంగా గ్రహించి, ఒక విషయాన్ని ఒకరు పల్కితే, దేనినీ ప్రమాణంగా చూపకుండా, ఊరికే అది ఎందుకు? ఇది ఎందువల్ల? (కుతః కుతః) అని ఆగకుండా ప్రశ్నించే వితండవాదులు, కౌతస్కుతులు అనబడుతున్నారు. వారు అడిగేది ఏది? అనే విషయాన్ని కూరేశులు స్వయంగా అనుగ్రహించిన శ్రీ వైకుంఠస్తవంలోని **"కిం సాధనః క్వ నివసన్"** ఇత్యాది ముప్పై ఎనిమిదవ శ్లోకాన్ని బట్టి తెలియవచ్చు.

కుమ్మరివాడొకడు దండచక్రాదులను సాధనాలుగా చేసికొని, మన్నును ఉపాదానకారణంగా గ్రహించి, ఒకచోట ఉండి అమ్మితే వచ్చే ధనాన్ని ప్రయోజనంగా చేసికొని బాన, కూజా, కుండ, చట్టి, ప్రమిద, మూకుడువంటి వస్తువులను చేస్తున్నాడుకదా! ఈ రీతిలోనే భగవానుడు లోకాన్ని సృష్టించేటపుడు దేనిని సాధనాలుగా చేసికొని, దేనిని ఉపాదానంగా గ్రహించి, ఎక్కడ ఉంటూ, దేనిని ఫలంగా భావించి, సృష్టి చేస్తున్నాడు? అని హేతువాదులు ప్రశ్నిస్తారు. దేనినైనా ఒక దానిని సాధనంగా చేసికొన్నాడంటే, ఆ సాధనాన్ని సృష్టించేటపుడు దేనిని ఉపాదాన కారణంగా చేసికొని



ఉంటాడు?- అని ఈ విధంగా అంతు లేకుండా ప్రశ్నిస్తూ ఉంటారు. ఎక్కడైనా ఒక చోట ఉంటూ సృష్టిస్తాడని అంటే, ఆ చోటును సృష్టించేటపుడు దేనిని చోటుగా చేసికొని సృష్టిస్తాడు? అని ప్రశ్నిస్తూ ఉంటారు. దేనినైనా ఒకదానిని ప్రయోజనంగా భావించి సృష్టి చేస్తాడు అని అంటే, లోకాలను సృష్టించినపుడు భగవానునకు కలిగే ఆ ఫలం సృష్టికి ముందు కలిగే అవకాశం లేదు కనుక, మీరు ఆ భగవానుని **"అవాప్తసమస్తకాముడు"** (తాను ఆశించినవానిని అన్నిటినీ ఆశించిన రీతిలో వెంటనే పొందిన వాడు) అని ఏ విధంగా చెప్పగలరు? అని అంటారు. ఫలం ఏమీ లేదు అని అంటే, **"ప్రయోజన మనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే"** (ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా మందబుద్ధి సైతం ఏ పనిని చేయడానికి ప్రారంభించడు) కద! మీరు భగవానుని సర్వజ్ఞుడని అంటున్నారు. అదే విధంగా పొసగుతుంది? అని ప్రశ్నిస్తూంటారు. ఇటువంటి అంతు లేని కుతర్కాలను చేస్తూ వాదించే కౌతస్కుతుల నోరును వేదవాక్యాలను ప్రమాణంగా గ్రహించి, కూరేశులు మూయిస్తున్నారు - అని స్తుతికర్త అంటున్నారు.

వేదవాక్యాలను ప్రమాణంగా చేసికొంటే, ముందు అడిగిన ప్రశ్నలకు అన్నిటికీ సమాధానం చెప్పడానికి వీలు అవుతుంది. **"యః సర్వజ్ఞః"** (ఎవడు అన్నిటినీ తెలిసిన వాడో) అని ముండకోపనిషత్తులో (1-1-10) సర్వజ్ఞత్వాన్ని, **"పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే"** (ఈ భగవానుని గొప్ప శక్తి పలు రీతులలో ఉన్నదని వినబడుతున్నది) అని శ్వేతాశ్వతరోపనిషత్తు (6-8)లో సర్వశక్తిత్వాన్ని చెప్పినందువల్ల ఈ రెండు గుణాలతో కూడిన బ్రహ్మమే లోకానికి సహకారి కారణం అని, **"సదేవ సౌమ్య ఇద మగ్ర ఆసీత్"** (పలువిధాలుగా కన్పించే ఈ లోకం సృష్టికి పూర్వం సత్ అనబడే పరబ్రహ్మ గానే ఉన్నది) అని ఛాందోగ్యోపనిషత్తులో (6-21) స్థూలమై, అనేకవిధాలైన చేతనాచేతనాలై కన్పించే జగత్తుకు సూక్ష్మంగా ఉన్న చేతనా చేతనాలను శరీరంగా కల్గిన పరబ్రహ్మమే ఉపాదాన కారణం అని, **"స్వే మహిమ్ని ప్రతిష్ఠితః"** (తన యొక్క మహిమలో స్థిరంగా ఉన్నాడు) అను ఛాందోగ్యోపనిషత్తులో (7-24-1) తననే ఆధారంగా చేసికొన్నందున వేఱొకచోట ఉంటూ తాను లోకాన్ని సృష్టించవలసిన నిర్బంధం లేదు- అని, **"క్రీడతో బాలకస్యేవ చేష్టాం తస్య నిశామయ"** (ఆటలాడే చిన్నబాలుని క్రీడవంటిదిగా విష్ణువుయొక్క సృష్ట్యాది కార్యాలను తెలిసికో) అని వేదాంతవివరణాత్మకం అయిన విష్ణుపురాణంలో (1-2-18) జగత్సృష్టి మొదలైనవి భగవానునకు లీలగా చెప్పబడినందున, భగవానుని తాత్కాలికసంతోషమే ఫలంగా గ్రహించాలి అని చెప్పబడిన సమాధానాలను గ్రహించాలి. నిత్యుడైన పరమాత్మే సహకారికారణంగా, ఉపాదానకారణంగా, చోటు మొదలైన నిమిత్తకారణంగా

అవుతున్నందున వాటిని ప్రత్యేకంగా సృష్టించవలసిన ఆవశ్యకత లేదు. కనుక, వేఱొక సహకారికారణం, ఉపాదానకారణం, నిమిత్తకారణం ఏది, ఏది, ఏది- అని కౌతస్కుతులు ప్రశ్నించలేరు- అని తెలియవచ్చు. అన్నీ పుష్కలంగా ఉన్న ప్రభువు సైతం వినోదంకోసం, తాత్కాలికమైన ఆనందంకోసం బంతి ఆట ఆడవచ్చును. కనుక, భగవానుని అవాప్తసమస్తకామత్వానికి ఏ కొఱత లేదు- అని కూడ గ్రహించవచ్చు.

**"కిం సాధనః క్వ నివసన్ కిముపాదదానః కస్మై ఫలాయ సృజతీశ ఇదం సమస్తమ్, ఇత్యాద్యనిష్ఠితకుతర్క మతర్కయంతః త్వద్వైభవం శ్రుతివిదో విదు రప్రతర్క్యమ్"** (శ్రీ వైకుంఠస్తవం-38) (సర్వేశ్వరుడు ఈ జగత్తులోని అన్నిటిని దేనిని సాధనంగా చేసికొని, ఎక్కడ ఉంటూ, దేనిని ఉపాదానకారణంగా చేసికొని, ఏ ప్రయోజనం కోసం సృష్టిస్తున్నాడు? అని ఈ రీతిలోని అంతు లేని కుతర్కాలను వేటిని చేయని వేదవేత్తలైన పెద్దలు స్వామీ! నీ మహిమనుగూర్చి పల్కితే అది ఏ విధంగా సాధ్యం? ఇది ఏ విధంగా సాధ్యం? అని ప్రశ్నించరాదని తెలిసికొంటున్నారు) అనే ఈ కూరేశుల శ్లోకాన్ని అనుసరించే స్తుతికర్త అయిన దొడ్డయాచార్యస్వామి ఈ 38వ శ్లోకాన్ని రచించారు అన్నది స్పష్టం.

**34. ప్రవాళరుచిరాధరస్ఫురితఛారుమందస్మితః**
**ప్రకామమధురాక్షరై రభినవైః స్వవాగ్గుంఫనైః ।**
**సదా వ్యవహరన్ కలాః సమితి సాత్త్వికాగ్రేసరాన్**
**తనోతి బహువిస్మయాతిశయచిత్రితాన్ కూరపః ॥**

**కూరపః** = కూరేశులు, **ప్రవాళరుచిర + అధరస్ఫురితచారుమందస్మితః** = పగడంవంటి అందమైన అధరంలో ప్రకాశించే మనోహరం అయిన చిఱునవ్వును కలవారై, **ప్రకామమధుర + అక్షరైః** = చాల తీయని అక్షరాలను కల్గినవి, **అభినవైః**= దీనికి ముందు విననివి అయిన, **స్వవాక్ గుంఫనైః** = తమ వాక్కుల సమూహాలతో, **సమితి** = వాదయుద్ధంలో, **సదా** = ఎల్లప్పుడు, **కలాః** = శాస్త్రాలను, **వ్యవహరన్** = తెలుపుతున్నవారై, **సాత్త్విక + అగ్రేసరాన్** = సాత్త్వికగుణాన్ని కలవారిలో ముఖ్యులైన వారిని, **బహువిస్మయ + అతిశయ చిత్రితాన్** = పలు రీతులలోని ఆశ్చర్యాల ఆధిక్యం చేత చిత్రంలో వ్రాయబడినవారినివలె (కదలిక లేకుండా ఉండేటట్లు) **తనోతి** = చేస్తున్నది.

రజోగుణాన్ని, తమోగుణాన్ని కల అన్యమతస్థులతో కూరేశులు వాదం చేసేటపుడు కొంచెంకూడ ఆగ్రహించకుండా, మందహాసంతోనే సంభాషిస్తారు. వారు



పలికేటపుడు వారి వాక్కునుండి పలు విధాలైన శాస్త్రార్థాలు వ్యక్తమవుతాయి. పదాల పొందికకూడ అపూర్వంగా, చాల ఆశ్చర్యకరంగా ఉంటుంది.

ఇటువంటి శబ్దప్రయోగాలను, అర్థవిశేషాలను వినిన, ఆ సభలో కూడి ఉండే-సత్త్వగుణాన్ని కల పెద్దలు, విద్వద్వరేణ్యులు అత్యాశ్చర్యంతో పరవశులై తమ శరీరాన్ని, పెదవిని కదపలేనివారై, చిత్రంలోని బొమ్మలవలె నిశ్చేష్టులవుతారు.

ఈ సందర్భంలో **"శురుణ్డిరు కొణ్డు కు*ళ*ల్ తా*ళ్*న్ద ముకత్తాన్ ఊదుకిన్ద కు*ళ*లోశై వ*ళి*యే మరుణ్డు మాన్ కణజ్గళ్ మేయ్కై మఱన్దు మేయ్న్ద పుల్లుమ్ కడైవాయ్ వ*ళి* శోర ఇరణ్డు పాడుమ్ కులుజ్గా ప్పుడై పెయర్వా*ళు*దు శిత్తిరజ్గళ్పోల నిన్దనవే** (గుండ్రంగా చుట్టుకొని ఉండే ముంగురులు తారాడే ముఖాన్ని కల శ్రీకృష్ణస్వామి ఊదుతున్న వేణుధ్వనిని విన్న మార్గంలోని లేళ్ళ గుంపులు తాము గడ్డిని మేయడం మానివేసి, మేసిన గడ్డి నోటి చివరినుండి జారుతూ ఉండగా, రెండు వైపులా కదలని నిశ్చేష్టమైన స్థితిలో చిత్రంలో వ్రాయబడ్డ చిత్తరువులవలె ఉన్నాయి) అనే పెరియా*ళ్వా*ర్ తిరుమొ*ళి*(3-6-9) సూక్తి స్మరణీయం.

వేణుగానరవంలోని అర్థం గోపికలకు తప్ప లేళ్ళ గుంపుకు తెలియదు. ధ్వనిని మాత్రం విని లేళ్ళ గుంపులు పొందిన ఆశ్చర్యంకంటే, కూరేశుల మాటలను, శాస్త్రార్థాలను విని సాత్త్వికులైన పెద్దలు పొందిన ఆశ్చర్యం చాల గొప్పది, వాచామ గోచరంకద! వారు చిత్తరువులవలె నిశ్చేష్టులు కావడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. ఇది కూడ కూరేశుల మహిమలలోని ఒక విశేషమే. **"సమిత్"** అంటే యుద్ధం. ప్రకృతంలో వాదమనే యుద్ధం- అని అర్థం.

**35. కథాహవకృతోద్యమాన్ కలిమలానులిప్తాశయాన్**
**తథాగతమతానుగాన్ తదితరాన్ ద్విషద్వాదినః ।**
**ముధాకృతపరిశ్రమాన్ ముకుళితాత్మవాగ్జృంభణాన్**
**విధాయ విబుధస్తుతో జయతి కూరనాథో గురుః ॥**

**కూరనాథః గురుః** = కూరేశులనే ఆచార్యులు, **కలిమల+అనులిప్త+ఆశయాన్**= కలియొక్క దోషాలచేత దూషింపబడ్డ మనస్సును కలవారై, **కథా+ఆహవ కృతోద్యమాన్**= వాదం అనే యుద్ధంలో చేయబడ్డ ప్రయత్నాన్ని కలవారైన, **తథాగత మతానుగాన్** = బౌద్ధమతాన్ని అనుసరించేవారిని, **తదితరాన్** = వారికంటే వేఱయిన, **ద్విషత్ వాదినః** = ప్రతివాదాన్ని చేసేవారిని, **ముకుళిత+ఆత్మవాక్ జృంభణాన్** = మూయబడ్డ తమ వాక్కుల వృద్ధిని కలవారినిగా, **ముధాకృత పరిశ్రమాన్** = నిష్ఫలంగా

చేయబడ్డ తమ పరిశ్రమను కలవారినిగా, **విధాయ** = చేసి, **విబుధస్తుతః** = సాత్త్వికులైన పండితులచే స్తుతింపబడినవారై, **జయతి** = సర్వోత్కర్షతో ప్రకాశిస్తున్నారు.

కూరేశులు బుద్ధుని మతాన్ని అనుసరించేవారితోను, మిగిలిన అన్యమతస్థుల తోనూ వాదించి, వారిని జయించి వారు గడబిడగా పలికే పసలేని మాటలను అణచి, వారు తమ తమ శాస్త్రాలలో చేసిన కృషిని నిష్ఫలంగా చేసివేశారు. దానిని చూచి అక్కడ ఉండే పండితులు వారిని ప్రశంసించారు - అని శ్లోక తాత్పర్యం.

లేక, గతశ్లోకంలో ఆశ్చర్యంలో పరవశమై, మోహించి చిత్తరువులవలె నిశ్చేష్టు లయ్యారని చెప్పబడ్డ సాత్త్వికులైన పండితులే కొంచెంసేపయిన తర్వాత ఆ మోహం, ఆశ్చర్యంనుండి తేరుకొని పొగడారు- అనికూడా చెప్పవచ్చు. తథాగతుడంటే బుద్ధుడు.

**36. నిరాకృతదురీహితైః నిగమసారసందర్శిభిః**
**నిరస్తదురితాలిభిః నిఖిలసంశయచ్ఛేదిభిః ।**
**నితాంతమధురైః శుభైః నిఖిలసౌఖ్యసంపాదకైః**
**నిజై ర్వచనగుంఫనైః జయతి కూరనాథో గురుః ॥**

**కూరనాథః గురుః** = కూరేశులనే ఆచార్యులు, **నిగమసారసందర్శిభిః** = వేదాంతాల సారార్థాలను తెలియజేసేవి, **నిఖిలసంశయచ్ఛేదిభిః** = అన్ని సందేహాలను తీర్చగలిగేవి, **నితాంతమధురైః** = చాల తీయనివి, **శుభైః** = మంచిని కల్గించేవి, **నిఖిలసౌఖ్యసంపాదకైః** = అన్ని విధాలైన సౌఖ్యాలను కల్గించేవి, **నిరాకృత-దురీహితైః**= పోగొట్టబడిన వేఱు విధాలైన అర్థాలను కల్గినవి, **నిరస్తదురిత + ఆలిభిః** = (అన్యథా కృతమైన అర్థాలు కలగడానికి కారణం అయిన) పాపసమూహాన్ని పారదోలేవి అయిన, **నిజైః** = తమయొక్క, **వచనగుంఫనైః** = శ్రీసూక్తి సమూహాలతో, **జయతి** = సర్వోత్కర్షతో వెలుగుతున్నారు.

కూరేశులు శబ్దసందర్భాలు- వేదసారాన్ని బోధించి, సందేహాలను అన్నిటినీ తీరుస్తాయి. వినడానికి మధురంగా ఉంటాయి. అంతేకాక, అన్ని హితాలను కల్గించగల్గినవి. శత్రువుల అన్యథాభావాలను, వానికి కారణం అయిన వారి పాపాలను పోగొడతాయి-అని అంటున్నారు. మహాత్ముల సూక్తులకు గల లక్షణాలు ఇవే కదా!

**37. కలి ర్హతభవోఽభవత్ కలుషజాత మున్మూలితం**
**తమ శ్చ రజసా సమం విలయ మాప సత్త్వం పునః ।**
**సమేత్యుపచితం నృణా ముదయ మేతి ధీవల్లరీ**
**మహీతల ముపాగతే మహతి కూరనాథే గురౌ ॥**



**కూరనాథే** = కూరేశులనే, **మహతి గురౌ** = గొప్ప గురువు, **మహీతలమ్ ఉపాగతే**= భూమిని పొందగానే (భూమిలో అవతరించగానే), **కలిః** = కలియుగం, **హతభవః**= నాశం చేయబడిన ఉనికిని కల్గినదిగా, **అభవత్** = అయినది, (ఏ విధంగా? అని అంటే) **కలుషజాతమ్** = పాపసమూహం, **ఉన్మూలితమ్** = సమూలంగా పెళ్ళగించ బడినది, **తమః+చ రజసా సమమ్** = తమోగుణం రజోగుణంతోపాటు, **విలయమ్ ఆప** = నాశనాన్ని పొందింది, **సత్త్వం పునః** = సత్త్వగుణం అయితే, **ఉపచితిం సమేతి** = వృద్ధిని బాగా పొందుతున్నది, (అందువల్ల), **ధీవల్లరీ** = జ్ఞానం అనే తీగ, **ఉదయమ్ ఏతి** = వృద్ధిని పొందుతున్నది.

కూరేశుల అవతారంయొక్క మహిమను ఇందు స్తుతికర్త తెలుపుతున్నారు. సముద్రవర్ణుడైన శ్రీమన్నారాయణుడే పరతత్త్వం అని తెలిసినందువల్ల సత్తను పొందిన కూరేశులు ఈ భూమిలో అవతరించగానే **"కలియుమ్ కెడుమ్"** అనే నమ్మాళ్వార్ల శ్రీసూక్తి రీతిలో కలియుగం నశించిపోయింది. కలియుగం- అంటే పాపం, దానికి కారణమైన రజోగుణ, తమోగుణాలు. ఇవి బాగా ప్రబలి, సత్త్వగుణమే లేకుండా పోయే యుగం. దాని సత్తలేకుండా పోవడం అంటే, పూర్వం తెల్పిన దానికి విరుద్ధంగా తమోగుణం, రజోగుణం నశించిపోయి, సత్త్వగుణం వృద్ధి కావడం. సత్త్వగుణం వృద్ధి అయితే తత్కార్యం అయిన **"సత్త్వాత్ సంజాయతే జ్ఞానమ్"** అన్నట్లు జ్ఞానంకూడ వృద్ధి పొందుతుంది. అందువల్ల కూరేశుల అవతారంవల్ల కలియుగం యొక్క దోషాలు అన్ని తీరి, కృతయుగధర్మం అయిన సత్త్వగుణం, దానివల్ల జ్ఞానం వృద్ధి అయినవని తాత్పర్యం.

**38. దయాదిసుగుణావలిః దనుజవైరిణా స్వామినా**
**నియంత్రితనిజాకృతిః నిలయ మేత్య కూరాధిపమ్ ।**
**ప్రతిక్షణవిజృంభితాకృతి రవాప్య లక్ష్యం పరం**
**ప్రకాశ మధిగచ్ఛతి ప్రతిహతాత్మతుల్యాధికః ॥**

**దనుజవైరిణా** = అసురులకు శత్రువైన, **స్వామినా** = భగవానునిచేత, **నియంత్రితనిజాకృతిః** = నియంత్రింపబడ్డ- పరిమితంగా చేయబడ్డ - తమ తమ శరీరాలను కల, **దయా+ఆది సుగుణ + ఆవలిః** = దయ మొదలైన సద్గుణాల సమూహం, **కూరాధిపం** = కూరేశులనే, **నిలయమ్ ఏత్య** = నిలయాన్ని - ప్రకాశవంతమైన ఆశ్రయాన్ని పొంది, **ప్రతిక్షణం విజృంభిత + ఆకృతిః** = క్షణం క్షణం వృద్ధి చెందిన తమ తమ శరీరాలను కల్గినదై, **పరం లక్ష్యం** = వృద్ధిలో

ఉన్నతమైన లక్ష్యాన్ని, **అవాప్య** = పొంది, **ప్రతిహత + ఆత్మతుల్య+అధికః** = తనతో సమానమైన, అధికమైన గుణసమూహం వేఱొకటి లేనిదై, **ప్రకాశమ్ అధిగచ్ఛతి** = వికాసాన్ని పొందుతున్నది.

గత శ్లోకంలో కూరేశుల అవతారమహిమ తెలుపబడింది. ఇందులో వారి దయ మొదలైన సద్గుణాల మహిమ తెలుపబడుతున్నది.

అసురులకు శత్రువైన శ్రీమన్నారాయణుడు తన దయాదిసద్గుణాలను అసురులపట్ల ప్రదర్శించకుండా, దేవతల విషయంలో మాత్రమే చూపి, వాటిని అధికంగా వృద్ధి చెందనీయకుండా అణచి ఉంచాడు. అవి ఇక ఇక్కడనే ఉంటే తాము తలచి నంతగా వృద్ధి చెండానికి వీలు కాదు - అని తలచి, భగవానుని మోసపుచ్చి, కూరేశులవద్దకు వచ్చి చేరి, దాగికొని, తాము ఆశపడిన అవధివరకు వృద్ధిపొంది వెలుగుతున్నవి. ఇందువల్ల భగవానుని దయాది సద్గుణాలకంటే కూరేశుల ఆ సద్గుణాలు గొప్పవి- అని చమత్కారంగా తెలిపినట్లయింది. దయ అంటే- తనకు ఏ ఫలాన్ని కోరకుండా, బాధపడే ఇతరులపట్ల జాలిని చూపడం. ఆదిశబ్దంచేత దోషాలను గుణాలుగా గ్రహించడం అనే వాత్సల్యం, మిక్కిలి గొప్పవాడు చాల చిన్న వారిలో ఏ తేడా లేకుండా కలిసి ప్రవర్తించడం- అనే సౌశీల్యం, మొదలైనవానిని గ్రహించాలి. కూరేశులు ఈ గుణాలను నాలూరాన్ మొదలైన శత్రువులపట్ల చూపించినందువల్ల కూరేశుల సద్గుణాలు చాల ఎక్కువగా వృద్ధి చెందినవి- అని తాత్పర్యం.

**39. శ్రియఃపతి రుదారధీః శ్రుతిగణైకకంఠ్యేడితాం**
**విహాయ పరమేశతాం భువి యదాత్మనాఽఽచార్యతామ్ ।**
**అవాప్తు మవతీర్య తత్సముపలబ్ధయే శిష్యతాం**
**అవాప యతిభూపతేః విజయతాం స కూరాధిపః ॥**

**ఉదారధీః** = గొప్ప తలపును కల్గిన, **శ్రియఃపతిః** = లక్ష్మీనాథుడు, **శ్రుతిగణ + ఐకకంఠ్య + ఈడితామ్** = వేదవాక్యసమూహంచే ఏకకంఠంగా స్తుతింపబడ్డ, **పరమ ఈశతామ్** = చాల గొప్పదైన సర్వేశ్వరత్వాన్ని, **విహాయ** = విడచి, **ఆచార్యతామ్ అవాప్తుమ్** = ఆచార్యత్వాన్ని పొందడంకోసం, **భువి** = భూలోకంలో, **యదాత్మానా** = ఎవరియొక్క రూపంతో, **అవతీర్య** = అవతరించి, **తత్ సముపలబ్ధయే** = ఆ ఆచార్యత్వాన్ని పూర్ణంగా పొందడంకోసం, **యతిభూపతేః** = యతిరాజులయొక్క, **శిష్యతామ్** = శిష్యుడై ఉండే స్థితిని, **అవాప** = పొందారో, సః **కూరాధిపః** = ఆ కూరేశులు, **జయతు** = సర్వోత్కర్షతో ప్రకాశిస్తున్నారు.



భగవానుని దయాదిగుణాలకంటే కూరేశుల దయాది సద్గుణాలు గొప్పవి అని గత శ్లోకంలో చెప్పిన దొడ్డయాచార్యులవారు ఇందులో భగవానుడే "సర్వేశ్వరుని అంగీకరించని నాస్తికులు సైతం ఆచార్యుని అంగీకరిస్తున్నందున సర్వేశ్వరుడనైన నాకంటే ఆచార్యుడే ఉత్తముడు'' అని తలచి, భూమిలో కూరేశులుగా అవతరించాడు. అందువల్లకూడ ఆచార్యత్వపూర్తిని పొందడానికి సాధ్యం కాదని ఆలోచించి, భగవద్రామానుజులకు శిష్యులై ఆ ఆచార్యత్వాన్ని పొందాడు- అని అంటున్నారు. శ్రీరామానుజుల శ్రీపాదాలలో ఆశ్రయించేకదా 74 మంది సింహాసనాధిపతులు అయిన ఆచార్యపురుషులు ఉజ్జీవించారు.

**40. వచోభి రనృతేతరైః అఖిలజీవజీవాతుభిః**
**ముముక్షుజనతాముదే మురరిపో ర్మహావైభవమ్ ।**
**సబాష్పనయనం బ్రువన్ సపులకోద్గమం సాదరం**
**సమిద్ధమధురస్మితో జయతి కూరపృథ్వీపతిః ॥**

**కూరపృథ్వీపతిః** = కూరేశులు, **అఖిలజీవజీవాతుభిః** = సకలజీవులకు జీవనౌషధమై, **అనృత+ఇతరైః** = అసత్యం కాని, **వచోభిః** = వచనాలతో, (వేదవాక్యాలతో) లేక, **"పొయ్యిల్ పాడల్"** అని కీర్తింపబడే సత్యరూపాలైన తిరువాయ్మొழి శ్రీసూక్తులు మొదలైనవానితో, **మురరిపోః** = మురాసురుని వధించిన భగవానుని, **మహావైభవమ్** = మిక్కిలి గొప్ప మహిమను, **ముముక్షుజనతా ముదే** = ముక్తిని పొందగోరే జనుల ఆనందంకోసం, **సబాష్పనయనం** = కన్నీరు స్రవించే కన్నులతో, **సపులక + ఉద్గమం** = గగుర్పాటుతో కూడినదిగా, **సమిద్ధ మధురస్మితః** = బాగా ప్రకాశించే తీయని మందహాసాన్ని కలవారై, **సాదరం** = ప్రీతితో, **బ్రువన్** = పల్కుతూ, **జయతి** = సర్వోత్కర్షతో వెలుగుతున్నారు.

ఇందులో కూరేశులు పొందే భగవదనుభవాన్నిగూర్చి పల్కుతున్నారు. ఆచార్యులు ప్రతి దినం అనుష్ఠించవలసిన కార్యాలలో ఉభయవేదాంతగ్రంథాలతో భగవానుని మహిమను మనసార గగుర్పాటును పొందే ప్రీతితో, మందహాసంతో అనుభవించి, ముముక్షువులైనవారికికూడ ఆ అనుభవాన్ని కల్గించే కాలక్షేపం కూడ ఒకటికదా! దానిని కూరేశులు నిర్వహించిన తీరు ఇందులో స్తుతింపబడింది. **"ఆహ్లాద శీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్, సదా పరగుణావిష్టో ద్రష్టవ్యః సర్వదేహిభిః"** అనే శ్లోకభావం కూరేశులపట్ల అనుసంధింపబడింది. కూరేశులకు ఆழ்வాన్ అనే పేరు కలదానికి మూలమైన ఐతిహ్యం ఇందులో పరోక్షంగా ప్రస్తావింపబడిందని చెప్పవచ్చు.

**41. భవాఖ్యమరుమేదినీవలనజాతతాపాతురాన్**
**జనాన్ హరికథామృతైః మధురశీతలైః జీవయన్ ।**
**తదీయపదశేషతాధియ మపార ముత్పాదయన్**
**విభాతి భువి కూరరాట్ విబుధసంఘసంసేవితః ॥**

**కూరరాట్** = కూరేశులు, **భవాఖ్యమరు మేదినీవలన జాత** = సంసారం అనే పేరును కల ఎడారి ప్రాంతంలో సంచరించడంవల్ల కల్గిన, **తాప + ఆతురాన్** = తాపంవల్ల బాధపడిన, **జనాన్** = జనులను, **మధురశీతలైః** = తీయనివి, చల్లనివి అయిన, **హరికథా+అమృతైః** = భగవత్కథలనే అమృత ప్రవాహాలతో, **జీవయన్** = ఉజ్జీవింపచేసేవారై, **తదీయపదశేషతాధియమ్** = జీవాత్మలు ఆ భగవానుని భక్తుల దాసులకు దాసులు అనే భావాన్ని (జ్ఞానాన్ని), **అపారం** = అధికంగా, **ఉత్పాదయన్** = కల్గించేవారై, **విబుధ సంఘ సంసేవితః** = విద్వద్గోష్ఠులచేత సేవింపబడినవారై, **భువి** = భూలోకంలో, **విభాతి** = ప్రకాశిస్తున్నారు.

ఈ శ్లోకంలోకూడ కూరేశుల భగవదనుభవ ప్రకారాన్నిగూర్చి పల్కి, జీవాత్మల భాగవతశేషత్వాన్ని వారికి చక్కగా వివరించి తెలిపి, విద్వద్గోష్ఠులచేత సేవింపబడుతున్నారని స్తుతికర్త తెలుపుతున్నారు. చేతనులు భగవానునకు దాసులైనంత మాత్రాన చాలదు. ఆ స్వామికి దాసులైన భాగవతులకుకూడ శేషభూతులై ఉండాలి. భగవానుడుకూడ తనకు దాసులైనవారిని తన దాసులకు దాసులుగా చేస్తాడు.

శ్రీరంగనాథుడు, శ్రీవేంకటేశ్వరుడు, శ్రీవరదరాజస్వామి- అనే ముగ్గురు తమకు దాసులైన తిరుప్పాణ్ ఆళ్వార్, తొండమాన్ చక్రవర్తి, ఎమ్బెరుమానార్ - అనే ఈ ముగ్గురిని ముందుగానే తమకు దాసులైన లోకసారంగముని, కుఱుమ్బ ఱుత్త నమ్బి, తిరుక్కచ్చినంబి - అనే ఈ ముగ్గురికి దాసులుగా చేయడాన్ని ఇక్కడ అనుసంధించాలి.

ఈ విధంగా కూరేశులు భగవానుని మహిమను దర్శించి అనుభవించి, ఆత్మలు భగవానునకు శేషమనే విషయాన్ని సూచించి తెలిపి, వారు భాగవతులు శేషం అనే విషయాన్ని వారికి స్పష్టంగా తెలియజేసినందున, ఆ విధంగానే తెలిసి కొన్న విద్వాంసులచేత సేవించబడి ప్రకాశిస్తున్నారు - అని శ్లోకంలోని తాత్పర్యం.

**42. అసద్భి రనుపద్రుతామ్ అనిదమాదివాణీం సతీం**
**అనన్యపదసంశ్రితాం హరిపదానుషక్తాం పరమ్ ।**
**జనార్దనపరత్వధీజనితభావబద్ధాశయైః**
**వచోభి రుపలాలయన్ జయతి కూరనాథో గురుః ॥**



**కూరనాథః గురుః** = కూరేశులనే ఆచార్యులు, **అనిదమాదివాణీం** = ఇదే పుట్టిన కాలం - అనేది లేని (అనాది అయిన) వేదవాక్కును, **జనార్దనపరత్వధీజనిత** = "భగవానుడైన జనార్దనునే పరమార్థంగా కల్గినది, భగవానునిగూర్చే తెలుపుతున్నది వేదం" అనే జ్ఞానం చేత కల్గించబడిన, **భావబద్ధ + ఆశయైః** = మనస్సులో ఊనికను కల-దృఢమైన - భావాన్ని తెలిపే, **వచోభిః** = తమ శ్రీసూక్తులతో, **సతీం** = పతివ్రత గాను, **అసద్భిః** = అసత్తులైన బాహ్యమతస్థులచే, **అనుపద్రుతాం** = తమకు తోచిన రీతిలో అంతా అర్థాలను చెప్పడానికి వీలు లేనిదానిని గాను, **అనన్య పదసంశ్రితామ్**= వేఱొక దైవం కాలిలో మొక్కనిదిగాను, **పరం** = మిక్కిలి, **హరిపద + అనుషక్తామ్** = భగవానుని శ్రీచరణాలలో భక్తిని కల్గినదానిని, **ఉపలాలయన్** = ఉపదేశిస్తున్నవారై, **జయతి** = సర్వోత్కర్షతో వెలుగుతున్నారు.

కూరేశులు తమ భగవదనుభవానికి మూలంగా ఉండే వేదాన్నిగూర్చి భగవానునే పరదైవంగా కల్గి ఉన్నది; అది భగవానునిపట్ల చాలా భక్తిని కల్గి, అతని శ్రీపాదాలలోనే తన తలను వంచుతుంది. వేఱొకరి కాలికి మొక్కదు - అనే ఈ రీతిలో అందరికి వివరించి పల్కి, ఆ వేదాన్ని భగవానుని విషయంలో పతివ్రతగా, బాహ్యమతస్థులచే ఉపద్రవం కల్గించడానికి వీలు లేనిదిగా స్తుతించారు- అని దీని ద్వారా తెలుప బడింది. **"శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తి మధీమహే, యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్"** అనే కూరేశుల తనియన్ భావం స్మరణీయం.

**43. అనంతగుణమౌక్తికైః అఖిలచేతనామోదకైః**
**అనంతనయసాగరాత్ స్వయ ముపాహృతైః శోభనైః ।**
**అనంతపదసంశ్రితా నభివిభూషయన్ శోభతే**
**హ్యనంతగుణశేవధి ర్జయతి కూరనాథో గురుః ॥**

**అనంతగుణశేవధిః** = అంతు లేని సద్గుణాలుకు నిధి అయిన, **కూరనాథః గురుః**= కూరేశులనే ఆచార్యులు, **అనంతనయసాగరాత్** = అంతు లేని శాస్త్రాలు అనే సముద్రంనుండి, **స్వయం** = తమకు తామే స్వయంగా, **ఉపాహృతైః** = తీసికొని రాబడినవి, **అఖిలచేతన + ఆమోదకైః** = సకలచేతనులకు ఆనందాన్ని కల్గించేవి, **శోభనైః** = మంచివి అయిన, **అనంత** = సద్గుణాలు పూర్ణంగా ఉన్న భగవానుని యొక్క, **గుణ** = సద్గుణాలనే, **మౌక్తికైః** = ముత్యాలతో, **అనంతపదసంశ్రితాన్** = భగవానుని శ్రీపాదాలను ఆశ్రయించిన భక్తులను, **అభివిభూషయన్** = చక్కగా అలంకరించేవారై, **శోభతే** = ప్రకాశిస్తున్నారు.

కూరేశులు శాస్త్రాలనే సముద్రాలనుండి అనంతగుణాలనే ముత్యాలను ఉద్ధరించి, వాటితో భగవద్భక్తులను అలంకరిస్తున్నారని అంటే - భగవానుని అనంతగుణాలను దాసులకు ఉపదేశించి, వాటిని వారు ఎల్లప్పుడూ అనుసంధించే టట్లు చేసి, ఆ విధంగా వారు తలచిన ముత్యాలను - అంటే-గుణాలను వారికి ఆత్మాభరణాలుగా చేస్తున్నారు - అని, అనంతగుణాలను దాసులకు ఉపదేశించి, ఆ ఆత్మగుణాలను కల్గినవారినిగా వారిని సంస్కరించి, ఆ గుణాలను వారికి ఆత్మాభరణాలుగా చేస్తున్నారని తాత్పర్యంగా గ్రహించవచ్చు. ఇందువల్ల కూరేశులు భగవద్భక్తులను తమవలె ఆత్మగుణపూర్ణులుగా చేసి, వారిని ప్రకాశింపజేసే గొప్పతనాన్ని కలవారని చెప్పినట్లయింది.

**44. ఆవాఙ్మనసగోచరామలదయాగుణైకాస్పదం**
**కులాదిమదదూషితోత్తరణబద్ధదీక్షః స్వయమ్ ।**
**యతీశ్వర మఘాపహం నిఖిలదేహినాం దర్శయన్**
**విలక్షణజనాశ్రితో జయతి కూరనాథో గురుః ॥**

**అవాఙ్మనసగోచర+అమల+దయాగుణ+ ఏకాస్పదమ్** = వాక్కుకు, మనస్సుకు అందని, దోషరహితమైన దయ అనే గుణానికి అద్వితీయ ఆశ్రయమైన, **కూరనాథః గురుః** = కూరేశులనే ఆచార్యులు, **స్వయం** = తాము స్వయంగానే (ఎవరినీ అర్థించకుండా), **కులాదిమదదూషిత + ఉత్తరణబద్ధదీక్షః** = మంచి కులంలో జన్మ మొదలైనవానివల్ల కల్గిన గర్వంచేత చెడిపోయినవారిని మోక్షం పొందించడంలో వ్రతాన్ని పరిగ్రహించినవారై, **నిఖిలదేహినాం** = సమస్తజనులకు, **యతీశ్వరం** = యతిరాజులైన భగవద్రామానుజులను, **అఘాపహం** = పాపాన్ని పోగొట్టి, మోక్షాన్ని పొందించేవారినిగా, **దర్శయన్** = దర్శింపజేసేవారై, **విలక్షణజన + ఆశ్రితః** = ఉన్నతులైన జనులచేత ఆశ్రయింపబడి, **జయతి** = సర్వోత్కర్షతో వెలుగుతున్నారు.

కూరేశులు తమను ఆశ్రయించినవారిని భగవద్రామానుజులు శ్రీపాదాలలో చేర్చి మోక్షాన్ని పొందింప జేస్తారు అని ఇందులో స్తుతికర్త అంటున్నారు. "కులంచేత, విద్యచేత, సంపదచేత తామే ఉన్నతులు" అనే గర్వాన్ని పొంది, ఇంకా ఇంకా ఇహలోక జీవితంలోనే ఉంటూ పరిభ్రమించేవారిని కూరేశులు తమ అపార కారుణ్యంతో మోక్షాన్ని పొందించాలనే వ్రతాన్ని చేపట్టి "ఓ చేతనులారా! అందరి పాపాలను పోగొట్టి, సద్గతిని పొందించే భగవద్రామానుజులను ఆశ్రయించి, ఉజ్జీవించండి" అని ఉపదేశించి, ఉజ్జీవనాన్ని పొందింప జేస్తున్నారు- అని తాత్పర్యం. భగవానుని దయ మనస్సుకు, వాక్కుకు ఒకవేళ అందితే అందవచ్చు. కూరేశుల



దయమాత్రం వాటికి అందనిది అనే భావాన్ని స్ఫురింపజేస్తూ **"దయాగుణైకాస్పదమ్"** అని ప్రయోగించారు. తిరువరఙ్గత్తముదనార్ కూరేశుల శ్రీచరణాలను ఆశ్రయించి, శ్రీరామానుజుల భక్తులు అయిన ఐతిహ్యం ప్రకృతంలో స్మరణీయం.

**45. యతీశితు మధీశతా మసహతోఽపి రంగామృతాత్**
**స్వకై శ్శమముఖై ర్గుణైః స్వపదశిష్యతా మేయుషః ।**
**గురో స్సముపలబ్ధయా నిఖిలయాఽపి రంగశ్రియా**
**యతీశ మభినందయన్ జయతి కూరనాథో గురుః ॥**

**కూరనాథః గురుః** = కూరేశులనే ఆచార్యులు, **యతీశితుః** = యతిరాజులైన భగవద్రామానుజుల, **అధీశతామ్ అపి** = మహాచార్యత్వాన్ని, **అసహతః** = సహించలేనివారై, **స్వకైః శమముఖైః గుణైః** = తమయొక్క శాంతి మొదలైన గుణాలతో, **స్వపద శిష్యతామ్** = తమ శ్రీపాదాలలో శిష్యులై ఉండడాన్ని, **ఏయుషః** = పొందేవారైన, **రంగామృతాత్ గురోః** = శ్రీరంగామృతకవి అనబడే తిరవరఙ్గత్తముదనార్ అనే ఆచార్యులవద్దనుండి, **సముపలబ్ధయా** = పొందబడిన, **నిఖిలయా అపి రంగ శ్రియా**= సమస్తమైన శ్రీరంగైశ్వర్యంతోను, **యతీశమ్** = భగవద్రామానుజులను, **అభినందయన్**= చాల ఆనందింపజేసేవారై, **జయతి** = సర్వోత్కర్షతో వెలుగుతున్నారు.

గడచిన శ్లోకంలో స్ఫురించే శ్రీరంగామృతకవి ఉదంతాన్ని ఇందులో స్పష్టం చేస్తున్నారు. ఒకానొక సమయంలో భగవద్రామానుజులను లెక్కించకుండా గర్వించి ప్రవర్తించిన తిరువరఙ్గత్తముదనార్‌ను కూరేశులు తమ శమదమాది సద్గుణాలతో ఆకట్టుకొని, తమ శ్రీపాదాలలో చేర్చుకొని, శిష్యులుగా పరిగ్రహించి, వారి ఆధీనంలో ఉన్న శ్రీరంగాలయసంపత్తును అంతటినీ స్వాధీనం చేసికొని దానిని భగవద్రామానుజలకు సమర్పించి వారికి ఎంతో ఆనందాన్ని కలుగజేశారు - అనే ఐతిహ్యం ఇందులో ప్రస్తావింపబడింది. కూరేశుల మహిమలలో చాల గొప్ప మహిమ ఇది. లేకపోతే **"తెన్నరఙ్గర్ శెల్వమ్ ముత్తుమ్ తిరుత్తి వైత్తాన్ వాழ்ியే"** (దక్షిణ దిక్కులోని శ్రీరంగాలయ సంపదను అంతటినీ సంస్కరించినవానికి మంగళం) (ఆర్తిప్రబంధం-31) అని ఈనాడు మనం భగవద్రామానుజులను మంగళాశాసనం చేసే అవకాశమే లేకుండా పోయేది. ఆ సంపద తమ వశంలో ఉన్నప్పుడుకదా సంస్కరించే అవకాశం ఉన్నది. దానిని భగవద్రామానుజుల వశంచేసినవారు కూరేశులే కదా! **"గురుం ప్రకాశయేద్ధీ మాన్"** (బుద్ధిశాలి అయిన శిష్యుడు ఆచార్యుని ప్రకాశింపజేయాలి) అనే శిష్య లక్షణం కూరేశులలో చాల బాగా ప్రకాశించింది. అంతేకాక, విద్యావంతులు

కాని లోకంలోని జనులను తమ విద్యతో సంస్కరించి, శ్రీమన్నారాయణునకు శేషభూతు లుగా చేసిన భగవద్రామానుజులకంటే, విద్యావంతులైన తిరువరఙ్గత్త ముదనార్‌ను తమ సద్గుణాలతో సంస్కరించి, భగవద్రామానుజులకు శేషభూతులుగా చేసిన కూరేశుల గొప్పతనం గొప్పది అంతు లేనిది కదా!

అందువల్ల, పూర్వం ఇరవై ఏడవ శ్లోకంలో కూరేశులు లోకంలోని జనులను ఉద్దేశించి “చేతనులారా! నూగుగింజ అంతకూడ ఆనందం లేకుండా అంతా దుఃఖమయంగా ఉండే ఈ లౌకికజీవనాన్ని దాటి, ఆనందమయుడైన శ్రియఃపతిని రక్షకునిగా ఆశ్రయించండి. ఉదారుడైన ఆ స్వామి తన ఆనందంతో సమానమైన ఆనందం అయిన మోక్షానందాన్ని లోకానికి అనుగ్రహిస్తాడు” అని ఉపదేశాత్మకంగా పల్కినపుడు, దానిని వినిన కొందరు కూరేశులవద్దకు వచ్చి, ఈ విధంగా బోధించే కూరేశుల శ్రీసూక్తి నమ్మదగినదేనా? అని ప్రశ్నించగా, వారి ఉపదేశం నమ్మదగినదని అనేదానికి సాక్షిగా **“విరక్తానా మగ్ర్యః”** అనే ఇరవై ఎనిమిదవ శ్లోకంనుండి ఈ శ్లోకంవరకు గల పదునెనిమిది శ్లోకాలలో కూరేశుల మహిమలను అన్నిటినీ అనుగ్రహించి, వారికి నమ్మకాన్ని కల్గించారు.

వారుకూడ, “ఆ విధంగానే భగవానుని ఆశ్రయిస్తాము” అని అన్నారు. అర్జునుని నమ్మించడంకోసం శ్రీకృష్ణునకు పదునెనిమిది అధ్యాయాలు ఆవశ్యకాలు అయ్యాయి. వీరిని కూరేశులు నమ్మించడంకోసం పదెనెనిమిది శ్లోకాలే సరిపోయాయి. భగవచ్ఛేషభూతుడైన అర్జునునికంటే, భాగవత శేషభూతుడైన వీరి మహిమ ఎంత గొప్పది! అధ్యాయాలు కాని, శ్లోకాలు కాని - పదునెనిమిది అనే సంఖ్యకు గల గొప్పతనం అప్రమేయం కదా!

**46. అనర్ఘవిపులాంశుకః సులసదూర్ధ్వపుండ్రాంకితః**
**సరోజతులసీమణిప్రచురమాలికాలంకృతః ।**
**కిరీటకటకాదిభిః వివిధభూషణైః భూషితః**
**సమావహతి కూరరాట్ అఖిలలోకనేత్రోత్సవమ్ ॥**

**అనర్ఘవిపుల + అంశుకః** = వెల కట్టడానికి వీలు కాని, గొప్ప దివ్యవస్త్రాలను ధరించినవారు, **సులసత్ + ఊర్ధ్వపుండ్ర + అంకితః** = తళ తళమని ప్రకాశించే తిరుమణికాప్పులతో ఏర్పడే శ్రీవైష్ణవచిహ్నాలను కలవారు, **సరోజ తులసీ మణి ప్రకరమాలిక + అలంకృతః** = తామరపూసలు, తులసీపూసలు నిండిన మాలలతో అలంకరింపబడ్డవారు, **కిరీట కటక + ఆదిభిః** = కిరీటం, అంగదాలు మొదలైన,



**వివిధ భూషణైః** = పలు అభరణాలతో, **భూషితః** = అలంకరింపబడ్డవారై, **కూరరాట్**= కూరేశులు, **అఖిలలోకనేత్రోత్సవం** = సమస్త జనుల నేత్రాలకు సంతోషాన్ని, **సమా వహతి** = కల్గిస్తున్నారు.

ఈ శ్లోకంనుండి అయిదు శ్లోకాలతో కూరంలో వేంచేసి ఉండే కూరేశుల అర్చావతారతిరుమేనియొక్క సహజసౌందర్యం, తిరుప్పరివట్టం, తామర, తులసీపూసల మాలలు, కిరీటం మొదలైన పలు తిరువాభరణాలు, పుష్పమాలికలు మొదలైనవానివల్ల కలిగే సముదాయసౌందర్య శోభ, వీటితో తైమాసంలో జరిగే కూరేశుల తిరునక్షత్రోత్సవంలో ఉదయ వేళ పల్లకిలో వేంచేసి ఉండి, తిరువీథులను అలంకరించడాన్ని, రాత్రి వేళలో **“పెరియ తోళుక్కి నియాన్”** అనే వాహనంలో వేంచేసి ఉండి, వేదాధ్యయనం చేసే శ్రీవైష్ణవోత్తములచే పరివేష్ఠింపబడి తిరువీథిలో వేంచేయడాన్ని, తైమాసంలోని హస్త నక్షత్రం అనే తమ తిరుఅవతారోత్సవంనాడు చందనం, పూలమాలికలు అనే వాటిని తాము, అలంకరించుకొని, శర్కర పొంగలి మొదలైన పలువిధాలైన ప్రసాదాలు తాము ఆరగించి, జనులందరికి వాటిని వినియోగం చేయించి, వారికి జన్మసాఫల్యం కలిగేటట్లు చేయడాన్ని తెలిపి, ఈ స్తోత్రాన్ని ముగిస్తున్నారు స్తుతికర్త.

**47. మహార్ఘముకుటోజ్జ్వలః స్ఫురదుదారహారావలిః**
**విలోలమణికుండలోల్లసితపీనగండస్థలః ।**
**విచిత్రకుసుమావలీకలితదివ్యమాల్యాంచితః**
**విభాతమధురాకృతిః జయతి కూరరాట్ దేశికః ॥**

**విభాతమధుర + ఆకృతిః** = చాలా బాగా వెలుగుతున్న, చూడడానికి మనోహరం అయిన తిరుమేనిని కల, **కూరరాట్ దేశికః** = కూరేశులనే ఆచార్యులు, **మహార్ఘమకుట + ఉజ్జ్వలః**= గొప్ప వెలను కల కిరీటంతో వెలిగేవార్రై, **స్ఫురత్ + ఉదారహార + ఆవలిః** = ప్రకాశించే, గొప్ప పెద్ద పెద్ద ముత్యాల హారాల వరుసను అలకరించుకొన్న వార్రై, **విలోలమణి మండల + ఉల్లసిత పీన గండస్థలః** = అటు ఇటు చలించే రత్న కుండలాలతో ఉజ్జ్వలంగా ప్రకాశించే, బలిష్ఠమైన కపోలభాగాలను కలవార్రై, **విచిత్ర కుసుమ + ఆవలీ కలిత మాల్య + అంచితః** = పలు వర్ణాలను కల పూలవరుసలతో గుచ్చబడిన పూమాలెలతో అలంకరింపబడినవార్రై, **జయతి** = సర్వోత్కర్షతో వెలుగుతున్నారు.

ఈ శ్లోకంలో **“విభాతమధురాకృతిః”** అని ప్రయోగించినందువల్ల కూరేశుల అర్చామూర్తిలో గల సహజ సౌందర్యం, గత శ్లోకంలోను, ఈ శ్లోకంలోను గల మిగిలిన

విశేషాణాలవల్ల ఆ తిరుమేనికి ఆభరణాలు, పూలమాలికలు, కిరీటం మొదలైన వానివల్ల కలిగే సముదాయశోభ వర్ణింపబడ్డాయి.

48. **ఉపారూఢే భానా వుదయ మధిరుహ్యానుదివసం**
**విచిత్రా మాందోళం వివిధమణిభిః కాంచనమయీమ్ ।**
**అలం కుర్వన్ వీథీః అనుపదకృతాకల్పసుభగాః**
**సమింధే కూరేశో మకరమహకాలేఽతిరుచిరః ॥**

**కూరేశః** = కూరత్తాళ్వాన్, **మకరమహకాలే** = తైమాసంలో జరిగే తిరు నక్షత్రోత్సవ సమయంలో, **అనుదివసం** = ప్రతి దినం, **భానౌ** = సూర్యుడు, **ఉదయమ్ ఉపారూఢే** = ఉదయాన్ని పొందగానే, **వివిధమణిభిః** = పలు విధాలైన రత్నాలతో, **విచిత్రాం** = పలు వర్ణాలను కల్గినదైన, **కాంచనమయీం** = బంగారంతో చేయబడ్డ, **ఆందోళం** = పల్లకిని, **అధిరుహ్య** = అధిరోహించి, **అతిరుచిరః** = ముందు తెలుపబడ్డ రెండు విధాలైన - అంటే - సహజసౌందర్యాన్ని, సముదాయ శోభను మిక్కిలిగా కలవారై, **అనుపదకృత+ఆకల్ప సుభగాః** = ప్రతిపదంలో చేయబడ్డ రంగవల్లికలు, అరటి బోదెలతో, పోకచెట్లతో, మాలికలతో, తోరణాలతో, ఇంకా ఇటువంటి అలంకారాలతో అందాన్ని పొందిన, **వీథీః** = తిరువీథులను, (తమ ఊరేగింపులో), **అలంకుర్వన్** = అలంకరించేవారై, **సమింధే** = మిక్కిలిగా ప్రకాశిస్తున్నారు.

తైమాసంలో జరిగే ఉత్సవాలు పదినాళ్ళలో ఉదయంపూట కూరేశులు పలు విధాలైన మణిహారాలు వేలాదీయబడిన బంగారు పల్లకిలో వేంచేసి ఉండి, ఒక్కొక్క ఇంటి వాకిలిలోను ముగ్గులు పెట్టి, పూర్ణకుంభ స్వాగతాన్ని భక్తులు పల్కగా, మామిడి ఆకులతోరణాలు, అరటిచెట్లు, పోక చెట్లు, కట్టబడి, చాల అందంగా ఉండే వీథులలో వేంచేయడం ఇందులో ప్రస్తావించబడింది.

49 సమాస్థాయ శ్రీమాన్ నిశి నిశి భుజాభోగ్య మతులం
మహాయానం బ్రహ్మప్రభ మఖిలభూషాంచితతనుః ।
త్రయీగాథాసక్తైః నిబిడసవిధో వైష్ణవవరైః
చరన్ శ్రీవత్సాంకో జయతి విశిఖాం కూరనగరే ॥

**శ్రీమాన్ శ్రీవత్సాంకః** = శ్రీ వైష్ణవ సిరిని కల కూరేశులు, **కూరనగరే** = కూరమనే నగరంలో, **నిశి నిశి** = ప్రతిరాత్రి వేళ, **అఖిలభూషా + అంచితతనుః** = అన్ని అభరణాలతోను అలంకరింపబడ్డ తిరుమేనిని కలవారై, **బ్రహ్మప్రభమ్** = బ్రహ్మ తేజస్సును కల్గినది, **అతులం** = సాటి లేనిది, **భుజాభోగ్యం మహాయానం** = **"తోళుక్కు**



**ఇనియాన్"**అనే పెద్ద వాహనాన్ని, **సమాస్థాయ** = ఆధిరోహించి, వేంచేసియుండి, **త్రయీగాథాసక్తైః** = ఋగ్యజుస్సామాలనే వేదాల సూక్తాలను గానం చేయడంలో ఆసక్తిని కల, **వైష్ణవవరైః** = శ్రీవైష్ణవోత్తములచేత, **నిబిడసవిధః** = దట్టంగా ఉండే సమీప ప్రదేశాన్ని కలవారై, **విశిఖాం చరన్** = పెద్ద వీథిలో వేంచేసి ఉండేవారై, **జయతి** = సర్వోత్కర్షతో ప్రకాశిస్తున్నారు.

కూరేశులు తైమాసంలో జరిగే ఉత్సవంలో సాయంసమయంలో సర్వాభరణ భూషితులై, వైదికశోభ నిండుగా ఉండే **"పెరియ తోళుక్కి నియాన్"** అనే వాహనంలో వేంచేసి ఉండి, తమ చుట్టు శ్రీవైష్ణవులు ఉభయవేదాలను పారాయణం చేస్తూ వేంచేయగా, పెద్ద వీథిలో ఊరేగింపుగా వేంచేసే సన్నివేశాన్ని స్తుతికర్త ఇందులో వర్ణిస్తున్నారు. **"మహాయానమ్"**- గొప్ప వాహనం. **భుజాభోగ్యమ్**=భుజాలకు భోగ్యమైనది. **"తోళుక్కు ఇనియాన్"** అనే ద్రావిడనామానికి ఇది సంస్కృతీకరణం. ఎక్కువ బరువు లేకుండా ఉన్నందున భుజాభోగ్యమనబడు తున్నది. **"మహాయానమ్, భుజభోగ్యమ్"** అనే రెండు పదాలు చేరి **"పెరియాతోళుక్కినియాన్"** అనే మంగళగిరివాహనాన్ని నిర్దేశిస్తున్నదనికూడ చెప్పవచ్చు. **"విశిఖా"**- ఊరి నడుమలో ఉండే పెద్ద వీథి. రాజవీథి. "**త్రయీగాథాసక్తైః**" - సంస్కృతవేదాలలో, గాథారూపాలైన ద్రావిడ వేదాలలో ఆసక్తులైన- అనికూడా చెప్పవచ్చు.

50. **సతాంబూలైః గంధైః కుసుమసహితైః భక్ష్యనివహైః**
**గుడాన్నాద్యై రన్నైరపి నిజమహాస్వాదమహితైః ।**
**కృతార్థా నాతన్వన్ నిఖిలమనుజాన్ కూరనృపతిః**
**స్వజన్మర్క్షే హస్తే మకరమహకాలే విజయతామ్ ॥**

**కూరనృపతిః** = కూరత్తాళ్వాన్, **మకర మహకాలే** = తై మాసంలో జరిగే ఉత్సవ సమయంలో, **స్వ జన్మర్క్షే** = తాము అవతరించిన నక్షత్రం అయిన, **హస్తే** = హస్తలో, **నిజమహాస్వాదమహితైః** = తాము అనుభవించడంచేత, అతిశయాన్ని కలుగ జేయబడినవి. **సతాంబూలైః** = వక్క, తమల పాకులతో కూడినవి అయిన, **గంధైః** = గంధాలతోను, **గుడాన్న + ఆద్యైః** = శర్కర పొంగలి మొదలైన, **అన్నైః+ అపి** = ప్రసాదాలతోను, **భక్ష్యనివహైః** = భక్షణసమూహాలతోను, **నిఖిలమనుజాన్** = జనులను అందరిని, **కృతార్థాన్** = ధన్యులుగా, **ఆతన్వన్** = చేసేవారై, **విజయతామ్**= విజయాన్ని పొందాలి!

కూరేశులు తైమాసంలో నడిచే తమ అవతారోత్సవాలలో శాత్తుముఱై ఉత్సవ సమయంలో హస్తనక్షత్రంనాడు విశేషంగా చందనం, పూమాలలను తాము

అలంకరించుకొని, శర్కరపొంగలి మొదలైన గొప్పప్రసాదాలను, పలు విధాలైన భక్ష్యాలను తాము ఆరగించి, తాంబూల చర్వణాన్ని చేసి, తద్ద్వారా వాటిని పవిత్రం చేసి, వాటిని అందరికీ వినియోగం చేయించి, వారిని పరమభాగ్యవంతులను చేయడాన్ని ఇక్కడ నిర్దేశించి, ఈ విధంగానే ఇంకా ఇంకా ప్రకాశించాలి అని మంగళాశాసనంతో ఈ స్తుతిని స్తుతికర్త పరిసమాప్తి చేశారు. **"జయ జయ"** అని స్తుతి ప్రారంభంలో చేసిన మంగళాశాసనాన్ని మళ్ళీ **"విజయతామ్"** అని చివరలోకూడ చేశారు. **"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే"** కదా!

**51. శ్రీమతా శుద్ధసత్త్వేన దొడ్డార్యేణ మహాత్మనా ।**
**పంచాశత్ కూరనాథస్య స్తోత్ర మీరిత ముత్తమమ్ ॥**

**శుద్ధసత్త్వేన =** శుద్ధసత్త్వం అని చెప్పబడే వంశంలో అవతరించినవారై, **మహాత్మనా =** గొప్ప మనస్సును కలవారై, **శ్రీమతా =** శ్రీ వైష్ణవశ్రీతో నిండినవారై ఉండే, **దొడ్డయార్యేణ =** దొడ్డయాచార్యులవారిచే, **కూరనాథస్య =** కూరత్తాళ్వాన్ విషయంగా, **పంచాశత్ =** యాభై శ్లోకాలను కల్గిన, **ఉత్తమమ్ స్తోత్రమ్ =** మిక్కిలి గొప్ప స్తోత్రం, **ఈరితమ్ =** విన్నపింపబడింది.

**"కూరనాథపంచాశత్"** అనే ఈ స్తుతిని అనుగ్రహించినవారు శ్రీశుద్ధసత్త్వం దొడ్డయాచార్యస్వామి - అనే విషయం ఈ శ్లోకంవల్ల తెలుస్తున్నది. ఈ శ్లోకాన్ని గ్రంథకర్తయే రచించి ఉండవచ్చు. లేక, వేఱెవరైనా రచించి ఉండవచ్చు. **"శ్రీమాన్"** అంటే - భగవద్భాగవతాచార్య భక్తి అనే శ్రీవైష్ణవ సిరితో పూర్ణమైన వారు - అని అర్థం. **"మహాత్మనా"**- గొప్ప మనస్సును కలవారు. మనస్సుకు గొప్పతనం అంటే- ముందు తెలిపిన భక్తికి ఉపకరణంగా ఉండడమే. దొడ్డయాచార్యర్ అంటే మహాచార్యులు. కన్నడభాషలో **"దొడ్డ"** అంటే **"పెద్ద"** అని అర్థం. తెలుగులోను ఈ అర్థంలో ఈ పదం ప్రయోగింపబడడాన్ని గమనించవచ్చు.

